శ్రీ

# లక్ష్మీశారదా శతకములు

## శ్రీరమాపతి శతకము.

## శారదాపతి శతకము.

&

## చాటుపద్యములు,


రచయిత్రులు.

శ్రీమతి—గిడుగు లక్ష్మీకాంతమ్మగారు,

&

శ్రీమతి—జొన్నలగడ్డ శారదాంబగారు.



ప్రకాశకులు,

శ్రీ. లక్ష్మీశారదలు

పెనుగొండ, పశ్చిమ గోదావరిజిల్లా.

పట్టాభి రామా ప్రెస్, ఏలూరు.

**1931**


---



[వెల రు **0-5-0**

# అభిప్రాయము.

శ్రీయుత లక్ష్మీశారదలకు,
లక్ష్మీశారదానిలయము,
పెనుగొండ.

ఉ॥ సోదరబుద్ధి నాపయినిఁ • జొన్పి భవత్కవితా రసంబు నా
స్వాదనచేయు భాగ్యము నొ • సంగిన మీకృప కేడక్మురశే
దేదియు గాని యాత్మజని • యించిన హర్షముఁ దెల్పు చుంటి నీ
మాదిరిఁ బద్యరూపమున • మానినులారా! గ్రహింపరే! దయన్;

గీ॥ స్త్రీల పాటలఁ బూచి ప • రిమళ మెల్ల
కడలకును జిమ్ముచుండు ప్రేం • కడమురీతి
స్త్రీల పాటలఁ బూచి ప • రిమళంబు
దవ్వు జిమ్మె మీ కవితాల • తామతల్లి.

మ॥ రసపూరంబయి సర్వకాలవిబుధా • రాధ్యంబునై యద్దుశే
క సదాపాఱుచు మంజులధ్వని జనా • కర్ణంబుఁ గావించి పెం
పెసఁగాగన్ సురవాహినిన్ "గుటిలగా • మీ!" యంచుహాస్యంబు జే
యుసతీ రత్నములార! సద్గతుల, నో • హో మీకవిత్వంబిలన్.

ఉ॥ ముద్దులు మూటగట్టు పద • ముల్ జత గూరుచు నిట్టి సేర్పు మీ
యిద్దఱి కట్టు లబ్బెనని • యెంచఁగఁ దోఁచదె! రామమూర్తి నే
ప్రొద్దును గుంటుపోనిగతిఁ • బూజలు చేయుచు నుంటచేత నీ
పద్దెములల్లు శక్తినిఁ గృ • పాయుతుఁడాతఁ డొసంగనంచొగిన్.

ఉ॥ మీకిలఁ దోడనీడయయి • మేకొను బాలినిఁ గోరుకోర్కెల
స్తోకము దానఁదీర్పు గుణ • శోభితుఁ డార్తిజనావనుండు సు
శ్లోకుఁడు రామమూర్తి దయఁ • జూచు మ నింక ననేక సత్కృతుల్
మీకలముల్ రచింపగ న • మేయ సమున్నతిఁ గూర్చుఁ గావుతన్.

హరి పురుషోత్తం.

31—10—1931.



# విజ్ఞప్తి

సోదర సోదరీ మణులారా !

శా॥ ప్రీతిన్, మాకిలవేల్పులౌ, గురువులౌ ♦ ప్రేమ, స్వరూపుల్
ఘనుల్ । పూతస్వాంతులు, పూజ్యులున్, వరగుణా ♦
పూర్ణుల్, కృపాసాగరుల్। నేతల్, మారమణీమణీపతిని,
వా ♦ ణీనా, యకుఙ్గొల్వగా, ప్రీతిన్, మే మిదె గూర్చి,
నాముగనరే ♦ ప్రేమప్రసూనంబులన్॥ 1

చ. పలువిధభక్తిభావముల ♦ భాసిలు నీపదతోయజంబులన్।
గలిగిన భక్తిసౌరభము♦గాటపుగూర్మిగనుంచు,మామనం।
బలరగ జేయుటయ్యదె, స♦మాదరమున్, మము, జూచు
టయ్యదే । సలలిత సమ్మదమ్మొదవ♦జక్కగ గాంచుడి,
మా సుపూజలన్॥ 2

పెనుగొండ
27—9—31 } శ్రీమతులు లక్ష్మీశారదలు.

శ్రీ

# కవితాభివందనము



క॥ శ్రీ, లక్ష్మీనృశారదలన్
పాలిత, నిజ భర్తృవాక్య ♦ భావోన్నతలన్ ।
శ్రీలక్ష్మీనృశారదలే
పాలింతురుగాత, భాగ్య ♦ వైభవ మిడుచున్॥ 1

చ॥ సరసకవిత్వ తత్వరస ♦ సాగరపారగ భవ్యభారతీ।
గురుతర సత్కృపా కలిత ♦ కోమలభావ విశేష, శేముషీ।
భరితరసజ్ఞులార! రస ♦ బంధురకావ్యనిబంధనాదిభా।
సురరచనాచమత్కృతుల ♦శోభిలుమీకవితావిలాసముల్॥

మ॥ పదలాలిత్యము శబ్దసౌష్ఠవము భా ♦వస్ఫూర్తి భాసిల్ల, ఆ।
స్పదమై శైలికి,భవ్యమౌచు వెలయన్ ♦సంగీతసాహిత్యముల్।
మృదులంబై, రసవంతమై, ల ♦ లితలక్ష్మీశారదా దివ్య, వా।
గ్వదితంబైనుతికెక్కెనా భళిర!"ల♦క్ష్మీనృశారదాగీతముల్"॥

చ॥ నయగుణలార ! భర్తమది ♦ నాట, "రమాపతి, శారదా
పతి"। ద్వయమునుగూర్చి, భావభరి♦తంపు సుధామధురో.
క్తులొప్ప,త। ద్దయుశతకద్వయమ్మునమహి♦తప్రతిభావిభవం
బుజూపి, మొంతయు దగురీతిగూర్చితిరి ♦ ధారుణిపెద్దలు
మెచ్చునట్లుగన్॥ 4

సీ॥ కపురంపు బలుకుల ♦ గవితాకుమారికి
నెమ్మెయి నేర్పితి ♦ రమ్మలార!
గవ్యక్తివాచాప్రౌఢి ♦ భాషించువైఖరి
నెమ్మెయి నేర్పితి ♦ రమ్మలార!
సూరిజనామోద ♦ సుకుమారభావమ్ము
లెమ్మెయి నేర్పితి ♦ రమ్మలార!
చిత్తతోషణములు ♦ చిన్నారిపోకడ
లెమ్మెయి నేర్పితి ♦ రమ్మలార!

తే॥ గీ॥ ధన్య యనన్యము మీకవి ♦ తాకుమారి
ధన్యలైతిరి మీరలో! తల్లులార!
అల్ల "శ్రీరాము"కృపను వర్ధిల్లు డమ్మ
లార, సుమల, "లక్ష్మీశార ♦ దాంబలార"॥

ఎడలి,
తణుకుతాలూకా.
17—10—31

ఇట్లు,
మంచెం బుచ్చిలింగప్పకవి.

---

# పతిభక్తి.

సీ॥ ప్రవిమలవిజ్ఞాన ♦ భాస్కర తేజుండు।
భాషాపరిజ్ఞాన ♦ భాసురుండు।
సరససుహృద్భావ ♦ సన్మార్గ చారిత్రు
డానందమయరూపు ♦ డార్యహితుడు।
బాలవిద్యావ్యాప్తి ♦ బరగంగ జేయంగ
బలుపొత్తముల వ్రాయు ♦ బండితుండు।
మృదుమంజుభాషలన్ ♦ వెదజిల్కు సదయుండు।
శ్రితజనలోలుండు ♦ శ్రీయుతుండు।

గీ. సత్య సద్భావ సౌశీల్య ♦ సంయుతుండు
శాంతిభూషణ విమల సు ♦ స్వాంతయుతుడు।
రమ్యగుణవర్తి మద్భర్త ♦ రామమూర్తి
సనయమున్ గొల్తు మదిని, నే ♦ వినయముగను॥

ఉ॥ కాంతలగాచుమాత, గుణ ♦ కాంతుల నిచ్చు త్రిలోక
పూత, నా స్వాంతమునందు నిల్చి సుఖ ♦ సంపదలిచ్చు
హిమాద్రిజాత, మత్కాంతు, సలక్ష్మీకాంతు, శుభ
కాంతు, నితాంతకృపాతరంగితస్వాంతు, కనారతంబు
ఘన ♦ సౌఖ్యము లీయుమ, శ్రీమహేశ్వరీ॥

శ్రీ. గిడుగు లక్ష్మీకాంత॥

సీ॥ ఆత్మసామ్రాజ్యమ్ము ♦ ననిశమ్ము కాంక్షించి
తనసౌఖ్య మొల్లని ♦ త్యాగమూర్తి।
నిజభాష నిజదేశ ♦ నిత్యోన్నతుల ధ్యాన
మాలలు వేయు ♦ సుశీలమూర్తి।
అతులవిశ్వాసశక్తి ♦ నసమాన ధృతులను
దిన సౌమ్ము చేసిన ♦ స్థైర్యమూర్తి।
పడరాని పాట్లను ♦ బడుచున్న వేళల
సంగీతసుధజిల్కు ♦ శాంతమూర్తి।
ఒరుల సేగులజూచి ♦ కరమూర్తి గుందెడు
నవనీతచిత్తి న ♦ న్మార్గవర్తి।
త్యాగాగ్నికుండమే ♦ తపస్సెజ్జగాగోరి
వ్రతదీక్ష విడని స ♦ ద్ధ్యానమూర్తి।
గీ॥ సత్యనియమానువర్తి, శ్రీ ♦ శాంతమూర్తి।
సాహితీసీమవర్తి వి ♦ జ్ఞానమూర్తి।
సత్వగుణవర్తి మద్భర్త ♦ సత్యమూర్తి।
ననయమున్ గొల్తు మదిని న ♦ త్యంతభక్తి॥

చ. తరుణుల పాలవెల్లి, నిజ ♦ దాసజనంబుల కల్పవల్లి మా
పరమదయా మతల్లి, భువి ♦ భాగ్యము లిచ్చు కృపామ
తల్లి, నీ చరణము లెల్ల వేళ మన ♦ సారగగొల్తు, సుభాగ్య
మిచ్చి, మద్వరుని, గుణాలవాలుని,శు♦భాంగుని, గావుమ,
శ్రీమహేశ్వరీ॥

శ్రీ. జొన్నలగడ్డ శారదాంబ.



# ఆశీస్సు.

సీ॥ ఆయుష్యమస్తు, మీ ♦ కైశ్వర్యమస్తు, స
త్పుత్రప్రాప్తిరస్తు, సౌ ♦ భాగ్యలార।
ఆరోగ్యమస్తు, మీ ♦ కఖిలదిగ్విజయోస్తు।
సమ్మానమస్తు, సు ♦ స్వాంతలార।
కల్యాణమస్తు, మీ ♦ కత్యంత శుభమస్తు,
ప్రియమస్తు, విభవోస్తు ♦ వెలఁదులార
విజ్ఞానమహిమాస్తు ♦ విస్తృతవిజయోస్తు,
సౌశీల్యమస్తు, సు ♦ జ్ఞానలార।
గీ॥ సరస గీతాది సాహితీ ♦ సహితలార।
చిత్త సామ్రాజ్యవైభవ ♦ శ్రేయఃలార।
లక్ష్మి - శారదలార! శ్రీ ♦ లలితలార।
నిత్య సౌభాగ్య మగు మీకు ♦ నెలఁతలార॥


గి. వెం. రామమూర్తి.

Dy. Inspector of Schools,
PENUGONDA,
West Godavary Dt.


27—9—'31.

సీ. పద్మినీద్యుమణుల ♦ బాంధవ్య గరిమంబు ।
నిందుకైరవముల ♦ పొందునెమ్మి ।
సురధునీ, సుమనుల ♦ చోద్యంపు నెయ్యంబు ।
జ్ఞానమానసిక ప్ర ♦ శస్త మైత్రి ।
ప్రసవ షట్పదముల ♦ ప్రఖ్యాతసఖ్యంబు ।
ఘనచాతకంబులు ♦ గాంచు పొత్తు ।
సుమసౌరభంబుల ♦ సొంపైన మిత్రత
కుముదేశు కౌముదీ ♦ కూర్మిపేర్మి ।

గీ॥ కైవడి వరలు సాహితీ ♦ గానకళలు ।
లక్ష్మిశారద కాంతల ♦ లలితకూర్మి ।
లలికఁ బుష్పించు గావుత! ♦ ప్రతిభకొనఁగ ।
వింతనా, సనతాపి, ది ♦ గంతములకు॥

Advocate
Rajahmundry. } జొ. సత్యనారాయణమూర్తి.

---



# ఇష్ట దేవతా ప్రార్థన.

## కాత్యాయనీ స్తుతి.

మ॥ కమనీయాచల రాజవంశజమణీ ♦ కైలాసనంవాసినీ ।
రమణీలోకవిహారిణీ, త్రినయనీ ♦ రాకేందుసద్భాషిణీ।
శమశాంత్యాది సలక్షణీ, వితరిణీ ♦ సౌభాగ్యస ధాయినీ
మముగాపాడుము, సర్వదా, కరుణతో ♦ మాతల్లి
మాహేశ్వరీ॥ 1

## లక్ష్మీస్తుతి.

శా॥ మాతా,మా, రమణమ్మ, గుణమణీ♦గూలక్ష్మి, కాంతా
మణీ । గీతాగానవినోదినీ, సుజననీ ♦ శ్రీంకారిణీ, మానినీ
చేతోమందిర వాసినీ, వినుతసౌ ♦ శీల్యాదిసల్లక్షణీ ।
పూతస్వాంత మొసంగిగావగదవే♦పూర్ణేందుబింబాననా॥

## సరస్వతీస్తుతి.

శా॥ వాణీ, మంజుల భాషిణీ, వినుతగీ ♦ ర్వాణీ, కృపాకారిణీ ।
వీణాపాణి, వినీలకుంతలల స ♦ ద్వేణీ, శుభాకారిణీ ।
పాణీకంకణ భూషిణీ, విమలస ♦ ద్భావప్రభాదాయినీ ।
వాణీనన్ గృపజూడుమమ్మ, నిను, నా ♦ స్వాంతమ్మునన్
గొల్చెదన్॥

శ్రీ లక్ష్మీశారదలు.

శ్రీ

# లక్ష్మీశారదా శతకములు

## "శ్రీ, రమాపతి" శతకము.

ఉ॥ శ్రీయుత, నీకుకీర్తనము ♦ శ్రేయము నాకిలవేల్పు వౌట, ని।
న్నాయతభక్తి గొల్వఁగ ని ♦ హైహికముల్, మరి, పార
మార్థికా। బీయము గల్గనోయనుచు ♦ నీపగు సపదపద్మ
ఫ్రూజలన్। ఆదెంగడాగితిన్ గొనుము ♦ సేమమొసం
గుము శ్రీరమాపతీ॥ 1

చ॥ సుమ మది వొట్టు లున్న, ధగ ♦ సౌ పుదలిర్చునుగాదె
సౌరభం। బమరిన శబ్దల, యూపదసు ♦ మా ఖలము
దలి భావసంపదన్। విమలతగాంతు వంచు, గడు ♦ బ్రీతిని
పద్యశతంబు నీ కిదే। సముచిత భక్తి నిచ్చితిని ♦ సమ్మతి,
గైకొను, శ్రీరమాపతీ॥ 2

చ॥ సరసుఁడ వంచు నీ వఖిల♦సద్గుణధాముడ వంచు వాక్సుధా।
సరసత నొప్పునాసు పద ♦ సారము గ్రోలఁగ నెంతువంచు నా।
వరకవితాసుధారసము♦ప్రాభవ మొప్పఁగ బల్కితిమ్యోడన్।
పరమదయానిధీ, గొనుమ ♦ సారదయామతి శ్రీరమాపతీ॥3

చ. చలిమల పుత్రికాసుతుకు ♦ జంపకపుష్పసుగంధమాలలన్।
గలువల బిల్వపత్రముల ♦ గ్రన్నన జేర్చి, విశుద్ధభక్తినే
సలుపుదు నెల్ల పూజలను♦సంతసమొందుచు, నాదువాక్కునన్
జెలువుగ నిల్చి విద్యలను♦ జేకురజేయగ శ్రీరమాపతీ॥

ఉ. శారద! వాక్ప్రసూనముల ♦ జక్కని నీపదతోయజంబులన్
మీరక, బూజసేతు నిక♦మేలుగ నాదగువాక్కుసందునన్
సారెకు నిల్చి నీదుసర ♦ సంబగుపల్కుల బల్కనిచ్చి, నా
కోరికదీర నీగృపను ♦ గూర్చిని జల్కుము భారతీసతీ॥ 5

ఉ. పూతమనస్కులై భువిని ♦ బూజ్యతనొందె, యనేకగ్రంథ
ముల్ ప్రీతి నొసంగినట్టి కవి♦ పింగళిసూరన, సన్నయాదు
లన్, బోతన, కాళిదాస ఘన♦భోజనృపాలుర తిక్కనార్యు
లన్ నీతముతోడగొల్తునవ ♦ నిన్ గడు వేడుక శ్రీరమాపతీ॥

చ. సదయ! భవత్కృపన్ హృదయము ♦ సారసమందు గవిత్వ
కన్య, సొంపొదవగ నుద్భవింప గడు ♦ పొందికగా జనువిచ్చి
బెంచి, నేమృదుమధురంపు బల్కులను ♦ మేలగుభూషల
నీయ జెచ్చెలున్ ముదమొదవన్ ధరించుకొని ♦ ముచ్చట
గానదియౌవనాంగియై పృథివిజరింపసాగె నిక ♦ బ్రీతి ద
లిర్పగ శ్రీరమాపతీ॥ 7

చ॥ మిడిమిడిజ్ఞానమున్ గలుగ ♦ మేటికిరీటము మస్తకంబునం।
దిడుకొనినట్లు మోదమున ♦ నింపగు పద్యములల్లి,నిన్ను నే.

దడయక బాడుచుంటిగద ♦ తప్పులువ్యాకరణాదిదోషముల్
కడలకు నెట్టిభావముల ♦గాంచుము ప్రీతిని శ్రీరమాపతీ॥

చ॥ తెలియదు యోగనిష్ఠ,యుప ♦ దేశమునొందగలేదు దేనినిన్
తెలియవు నీ మహాత్త్వములు♦తేటగ నీభువి సృష్టికల్పనల్
తెలియవు వేదశాస్త్రములు ♦ ధీనిధి!నిన్నె స్మరింతునీకృపన్
జలికి, కృతార్థ జేయు మిక ♦ శ్రీరమణీవర, శ్రీరమాపతీ॥

ఉ॥ పారిజపత్రనేత్ర, భవ ♦ పాపవినాశనసీతిపహోత్ర,శృం
గారచరిత్రమాత్ర,ముని ♦ కామిత గాత్ర,రమాకళత్ర వి
స్తారచరిత్ర! దుస్టభవ ♦ సాగరభీతిలతాలవిత్ర, బృం
దారకబృందమిత్ర, పర ♦ తత్వసుధాంబుధి శ్రీరమాపతీ॥

చ॥ సిరులనొసంగునీసతి,♦సేమముగూర్చెడు పొందెవీవు,సుం
దరతరసృష్టికల్పనల ♦ ధారుణి నీసు సుతుండుజేయు, స
త్కరుణనునీదుకోడలు,సుందారగుణాంబున విద్యగూర్చు,సు
స్థిరమతిమద్గృహంబున వ ♦సింపుడు నల్వురు శ్రీరమాపతీ॥

ఉ॥ తల్లివి తండ్రివంచు మరి ♦ దాతవు నేతవు నీవటంచు, నన్
జల్లగ జూతువంచు, మది♦ సంతతభక్తిని గొల్చుచుందు, నీ
వెల్లజగంబులున్ సతత ♦ మేలుచు నుండవె, పుణ్యశీల!నా
యుల్లమురంజిలంగ నెటు♦నోమదలంతువొ శ్రీరమాపతీ॥

చ॥ వినయవిధేయతామణుల ♦ వేడ్కఁగ నిన్ను నలంకరించెదన్
ఘనపున, బ్రేమమాల్యముల ♦ జక్కఁగ నీగళసీమనూత్రు, నే
ఘనమగుభక్తితోడ కర ♦ కంజము లన్నిను బూజసేతునిన్
గనియెడిభాగ్యమీవె పర ♦ ఘస్మరచిన్మయ శ్రీరమాపతీ॥

ఉ॥ సత్యసుశీలుడంచు, సతి ♦ శాంతిసుభూషణుడంచు, భక్తులన్
నిత్యముగాతువంచు, మరి ♦ నీదరిజేరిన బ్రోతువంచు, నే
నిత్యము నీదుపాదముల ♦ నేమరకే భజియించుచుందు, నో
సత్యగుణస్వభావ! నను ♦ జక్కఁగజూపుము శ్రీరమాపతీ॥

ఉ॥ భాగ్యముగోరవేన్ననను ♦ భక్తియు, జ్ఞానసుబోధతప్ప, యే
భోగ్యముగోర నీవు భువి ♦ పూతగుణాంచితశాంతిదప్ప, నా
భాగ్యములన్నియివ్వెయని ♦ భావనజేతువు భవ్యశీల! నీ
యోగ్యతజూడవింతయగు ♦ నెంతటిపుణ్యమొ! శ్రీరమాపతీ॥

ఉ॥ నీదుకథాసుధారసము ♦ నిత్యము గ్రోలగ జూచుచుందు, స
మ్మోదముతోనునాకెపుడు ♦ మోహనరూప, భవత్రుతాప
ముల్ । భేదముబాయ మద్రచిత ♦ గీతములన్నిను బాడు
కొందు, నన్ । భేదముసేయబోకికను ♦ బ్రీతినిజూడుము,
శ్రీరమాపతీ॥ 16

మ॥ కని, చేకూర్చితివీవునాకు, సుగుణా ♦ కాంతితున్, ప్రశాం
తున్, పతిన్ । ఘనసంతోషము నొందితిన్, గలుగగా ♦

కాంతుల్ జయంతుల్ సుతుల్, । మణిమాణిక్యములున్
కడున్విమల సీ ♦ మంతుల్ సుశీలల్సుతల్, గన దీర్ఘాయువు.
సౌఖ్యముల్ మము సదా ♦ గాపాడు లక్ష్మీపతీ॥ 17

చ. అతులితభక్తితత్పరత♦నై నిను మ్రొక్కుచునుంటినయ్య, ని
న్నతివినయంబునన్ హృదయమం♦దునునిల్పుచు సేవ జేతు,నా
సుతునకు నీదునామమిడి♦సొంపుగబిల్తును, శ్రీనివాస! నా
సతులనుగాంచు నీవెపుడు♦నన్గరుణింపుము, శ్రీరమాపతీ॥

చ॥ రతనపుబొమ్మలౌసుతుల ♦ రాజుల నిచ్చితినాకు, నీవికన్
సతతము గాచివారలకు ♦ జాలగనాయువుబుద్ధియున్బలం
బతులితసౌఖ్యముల్గలుగ♦నయ్యెడిభాగ్యములొందజేయుమో
హితమతి నన్నుబ్రోచు టది♦యేసుమగోరితి శ్రీరమాపతీ॥

ఉ. చాలరు నీమహామహిమ ♦ జక్కగ వర్ణనసేయుగా కవుల్ ।
జాలరు నీస్వరూపమును ♦ జక్కగ వ్రాయగ జిత్రలేఖకుల్
జాలరు నీమహోన్నతిని ♦జక్కగనెన్నగ మానిపుంగవుల్ ।
జాలుదునే కనుంగవను ♦ జక్కగ నిన్గన శ్రీరమాపతీ!

చ. సతతము వీకనిన్ను మన ♦ సారగ ధ్యానముసేయుచుందు, నే
నతులితమోదమొంద కను ♦లారగ నిన్గని, చేతులార ని
న్నతివినయాప్తింగొల్చి తని ♦వారగ బూజలుసేయుచుందు,
సన్మతి ననుబ్రోవుమయ్య బుధ ♦ మానిత శ్రీకర
శ్రీరమాపతీ॥ 21

శా. రామా నీయనురాగమే ననుసదా ♦ రంజింప జేయున్
జుమీ! వ్యామోహంబున నిన్ను గాంచు టదెనా ♦ వ్యాపా
రమేయాజుమీ నీముందున్ వసియించుచుండగ నిక ♦ న్నే
నేమి గోరన్ జుమీ! నామోదంబులు నీ కటాక్షము
లెయా ♦ నాభాగ్య లక్ష్మీపతీ॥ 22

ఉ. చెన్నగు నీదుదర్శన వి ♦ శేషముచే మదినుత్సుకంబునన్
పెన్నిధిగన్నయట్టి నిరు ♦ పేదవిధంబున నుబ్బుచుందు, నా
పన్నుడు వార్ధియందుబడి ♦ బాధలనొందుచు నూత
గొన్నయ ట్లెన్నుచు, సంతసమ్మొదవ ♦ నే నినుగాంచిని
శ్రీరమాపతీ॥ 23

ఉ॥ కోరనుభాగ్యభోగ్యముల♦గోరను పెక్కగుసౌఖ్యసంపదల్।
నేరములెంచకే మరియు ♦ నెంతయుబ్రీతినిజూడుమంటి,నా
భారమునీదెయంటి,నిను ♦ భావమునందునిల్పుకొంటి నన్
వేరుగ జూడకయ్య నిక ♦ వేడను పల్మరు శ్రీరమాపతీ॥

చ॥ అవిరతనీతిశీల, విమ ♦ లాంచితపూజితబుద్ధిశీల! యో ।
భువనసుపాల, భక్తజన ♦ పోషణ,శ్రీధర,శాంతశీల! యో
భవహర, ధర్మలోల, ఘన ♦ భాసురతేజ, సుకీర్తిలోల! హే
ప్రవిమలగానలోల,బుధ ♦ పక్ష!యధోక్షజ! శ్రీరమాపతీ॥

చ॥ పృథుతరభక్తిబూని,పృథి ♦ వీస్థలియందుత్వదీయనామమే
మదిదలపోయుచుందునభి♦మానముజూపిభవత్కటాక్షమున్

సదయతజల్కి—శాస్త్రముల♦సారములన్ గ్రహియింపజేయనీ
మృదుమధురంపువాక్సుధను♦మేలుగనీయుమ శ్రీరమాపతీ

చ॥ స్థిరతరమానసంబు, గురు ♦ సేవ, సమాహితమాత్మ
భక్తియున్ । పరమపతివ్రతామణుల ♦ పావనజీవనమార్గ
రక్తియున్ । ధర గలుగంగజేసి దురి ♦ తౌఘములెల్ల
నశింపజేయుచున్ । సరసవివేకసంపదలు ♦ సౌఖ్యము
లీయుమ శ్రీరమాపతీ॥ 27

మ॥ నిధి నిక్షేపములొందగా మదిని నే ♦ నెన్నండు గోరంగలే ।
దధికంబౌగతి నున్నతుల్ గనగ నే ♦ నాకాంక్ష సేయంగలే।
దధమం బిచ్చిన మట్టుకున్, నిలిపియే♦యాపత్తురానీకుమీ।
పృధుసౌభాగ్యము లీయుమీ, యవియె సు ♦ వ్వేప్రీతి
లక్ష్మీపతీ॥ 28

ఉ॥ వేకువలేచినిన్ మదిని ♦ వేడ్కజనింప స్మరింతునయ్య, నిన్।
బ్రాకటభక్తినెల్లపుడు ♦ బ్రార్థనసేయుచు నుందునయ్య, నే।
వీకనుబూని బల్కితిని ♦ వేరుదలంపక నమ్మునయ్య, యా।
స్తోకమనోజ్ఞసంపదల ♦ దూగగ జేయుమ శ్రీరమాపతీ॥29

ఉ॥ సారెకు నీస్వరూపమును ♦ స్వాంతమునందుననిల్పి, భక్తి
పెం । పారగ నీకథల్ వినుచు ♦ భావపరంపరగూర్చి, నిన్
సదా । మీరక గొల్చుచుంటి, నిది ♦ మిథ్యయటంచు

దలంపబోక, నన్ । గారవ మొప్పజూడు మిక ♦ కం్జ
క్షణ, శ్రీరమాపతీ॥ 30

ఉ॥ నీవె మదీయదైవమని ♦ నెమ్మనమందున గొల్చుచున్న,నన్।
గావగ భారమాయెనె? మరి ♦ గాచిన నీకది నేర మాయెన? న
న్నేవగ నైన బ్రోతు వని ♦ యేపుగ నిన్ననురక్తి వేడితిన్।
పావన, భక్తపాల, నను ♦ బాలన సేయుమ శ్రీరమాపతీ॥

చ॥ పిలిచిన బల్కవేమి ? మరి ♦ పిల్వగనంపిన రావదేమి ? నే
నలసత జెంది వేడితిని ♦ యంజలి జేయుచునుంటి నిత్యమున్,
పలుమరు మ్రొక్కులొగ్గుటకు ♦ పాడియ ? నీ కదిసంత
సంబుకో ! చులకన జేయకయ్య నను సొంపుగ జూడుమ
శ్రీరమాపతీ॥ 32

చ॥ ప్రవిమలనీతిశాలురును ప్రాభవ మొప్పెడు భవ్యశీలురున్
అవిరతకష్టముల్ బడుదు ♦ రచ్యుత! నీదుపదారవిందముల్
చవిగొనలేని యాఖలులు ♦ చాలగ సౌఖ్యము నొందు
చుంద్రు, మా ధవ! తవపాలనంబునను ♦ ధర్మమదెక్కడ
శ్రీరమాపతీ ? 33

చ॥ సరసిజలోచనుండవని ♦ సద్గుణధాముడవంచు, నాపయిన్
పరమదయాకరుండ వని ♦ పావనసచ్చరితుండ వంచు
నీ వరమరలేక నన్నిక ♦ సమాదరతన్ దగజూతువంచు,
నే సురుచిరలీల వేడితిని ♦ జూపుమ నీదయ శ్రీరమాపతీ॥

చ॥ అనయము నీమూర్తిని, న ♦ మ్మాదర మొప్పగ బూజకొందు, నే
నీ। ఘనమగు పాదపద్మముల ♦ గాంచుచు సేవలజేయు
చుందు, నె। మ్మనమున భక్తినుంచి, నిను ♦ మన్ననతో
స్మరియించుకొందు పా। పుమగన, నీకృపన్ జిలికి ♦ బ్రోవుము
వేగమె, శ్రీరమాపతీ। 35

ఉ॥ సమ్మతి రామచంద్ర! నిను ♦ సమ్మతినో, ఘనకీర్తిసాంద్ర, నే
సమ్మతి దీనబంధు! కను ♦ సమ్మతి నీపదపంకజంబులన్,
సమ్మతి వారి కెన్నటికి ♦ "నాస్తి" యటంచును బల్కనీవు, నన్
సమ్మతి బ్రోవుమన్నటిదగు ♦ సామివి నీవెగ! శ్రీరమాపతీ॥ 36

చ॥ భవహర! నా మహాపాపముల ♦ భారములై దివిసేటు సుమ్ము నీ
ప్రియముల నామమున్ దలప ♦ శాపసమైతి, భవత్కృపాంబుధన్
కువలయనేత్ర! నన్ దనిపి ♦ కారుణ్మిని బ్రోచి, భయంబుదీర్చి, యీ
భువిసుఖమొంద జేయుమిక ♦ భూసురవందిత! శ్రీరమాపతీ॥

ఉ॥ తండ్రియులిప్పుడీయుగను ♦ తల్లియుదా ప్రహితాతో గృపేయుడన్
అనువుగ జెప్పినట్లుగ, న ♦ యమ్మున దెల్పి, దొంగలున్న చో
మనుపగ జూచినావు, ఘన ♦ మార్గము జూపిన, బోవనుందునా?
చనువు కోసగినావు, సగ ♦ సంబుగ చెల్లును, శ్రీరమాపతీ॥

చ॥ జనమతి నీవటంచు, విని ♦ సంటుగ జూచుచు తప్పలెంచినన్
పుడమి భరింప గల్గుదునె? ♦ పుట్టినదాదిగ నిన్నె సమ్మతిన్
దడయక నీకృపన్ జిలికి ♦ తప్పులనన్నిటి సైచి నిప్పునన్
విడువక బ్రోవుమయ్య, నిను ♦ వేమరు వేడుదు, శ్రీరమాపతీ॥

చ॥ దివినల సూర్యచంద్రములయి ♦ తేజముతో ప్రభవించియుద్ధరన్
కవులొసగి చుకబ్బముల ♦ గ్రంథభావపుష్పాష్ఠై, మరిన్
కువలయసృష్టిని తతను ♦ గూడి మెలంగుచునుందు వౌర! యీ
భువనమునందు నీమహిమ ♦ బోలునదేదిక? శ్రీరమాపతీ॥

చ॥ త్రితజనతో షివంచు, కష ♦ నేమము గూర్చెడిదాతవంచు, ని
న్నతులితభక్తిగొల్చెదర ♦ యా! యదియంతయు జోద్యమౌగదా
ప్రతిఫలమేమిలేకయె, వ ♦ రంబుల నిచ్చుచు, నేనెరుంగుచున్
హితమతియౌను చేయుటకు ♦ నేనియు, నెంచుల, శ్రీరమాపతీ॥

శా॥ ఆశాపాయసమిచ్చెదా, గుడిపెదా ♦ యంచు మోదించెదా
గాశి జెందక నుండుమంచువుగదా! ♦ గల్గంగ జేతచు, నా
యాశల్ బో దగగల్గునో గలుగవో! ♦ యాంవాయ లేమా
యులో! "చేశా" నంచును జెల్పుచుందువుగ! "నే ♦ ని" జేడి ?
లక్ష్మీపతీ॥ 42

ఉ॥ తియ్యనిమాటలన్, మిగుల ♦ తృప్తినిగల్గజేసి, యూపయిన్
నెయ్యముతో డబంపెదవు ♦ నేర్పునమున్న హేతుగాని, ని
వియ్యవు పెన్కు కోరికల ♦ నెల్లరకున్ విశద బెంగనె! యా
ట్లయ్యును, నివెదాతవని ♦ యు దను నెంతువు, శ్రీరమాపతీ॥

చ॥ హితమతి నీవె, యెల్లెపల ♦ హెచ్చుగ, నాదరమొప్ప
బల్కుచున్। ధృతిమతి నీదలంచుగతి ♦ దీరజేసెదుగాని,
యూపయిన్। స్తుతులను నొందచుండెదవు చొప్పమరీతిని

జేసెదవంచు, నీ। చతురత నెంతగా బొగడ ♦ జాలుదునీభువి!
శ్రీరమాపతీ॥ 44

చ॥ కరుణయొకింతలేక, యవు ♦ గాదను యోచనసుంతలేక, నీ
దరికిని జేరగోర, నిజ ♦ దర్శనమీయవు, భృత్యకోటికిన్
మరిమరివేడ బల్కవికి ♦ మానితి! నీకిది ధర్మమౌన ? నీ
చరితముజూడ వింతయగు ♦జాలమునిన్గెస, శ్రీరమాపతీ॥

ఉ॥ భూములు పుత్రులా, భువిని♦భూరిధనార్జన సాధనంబులా?
సేమముగూర్పగాదగు,వి ♦ శేషధనాదిసుభూషణంబులా?
వేమరుజూడగానికి, ని ♦ వెవ్వియులేవుగ ! జేయనేది ? నీ
ప్రేమయె, ప్రాపునాకికను ♦ బ్రీతిని జూడుమ,శ్రీరమాపతీ॥

చ॥ చిరతరబంధుగున్ బలెను ♦ చిన్మయరూప! సుధీవిశాల!
నిన్। గురుతరభక్తివేడి, మరి, ♦ కోరి, నుతించి, స్మరింప,
నీకృపన్ కరతలభాగమౌ దమల ♦ కంబునుబోలె, గ్రహింప
గానగున్। నిరుపమ! నీదునామమెద ♦ నిత్యము గొల్తును,
శ్రీరమాపతీ॥ 47

చ॥ తనువు లశాశ్వతంబులని ♦ధారుణియందుజరించు నెట్లొ ప్పునే?
ఘనమగు ధైర్యమూని, కల ♦ కాలమునిల్చెడి మంచు నెంచి,
మే। మనువుగనిత్యకృత్యముల♦ మాన్యతసల్పగ ధర్మమంచు,
నె। మ్మనమున నెంచగల్గుటకు ♦ మార్గముజూపుమ,
శ్రీరమాపతీ॥

ఉ॥ సంపెగ పుష్పరాజముల ♦ జల్లుచు నీపదతోయజంబులన్
సొంపుగ బూజసేతు, నిను ♦ సుందరరూప! దయాంతరంగ!
నన్ । బెంపునుబొందజేసి, కడు ♦ బ్రీతిని జూచి, సుభాగ్య
మిచ్చుచున్। సంపదలాయురోన్నతులు ♦ సౌఖ్యములీయుమ,
శ్రీరమాపతీ॥ 49

చ॥ దినకరు రాకపోకలవి ♦ తిరుగనీమహిమంబుచేగదా!
దనరు! జరాచరంబులను ♦ దాల్చితివీవుదరంబులోపలన్
అనువుగనీదు భక్తహృద ♦ యాంతరమందువసించెదార!
యా। వనజభవాదులైన, నిను ♦ వర్ణనజేయగ జాలరేభువిన్
నిను బొగడంగ నాతరమె? ♦ నికృపజూపుమ, శ్రీరమాపతీ॥

ఉ॥ కూరిమినీదుసేవ సమ ♦ కూరినదాదిగ, నేటిదాక, నే
కూరుచునుండె,సౌఖ్యములు ♦ కోర్కులుదీరి శుభంబుబొం
దితిన్ । భారమటంచు నెంచక యె, ♦ భావినిగూడనిలాటి
భాగ్యమే । గోరుచునుంటినయ్య, నదె ♦ గూర్పుమ నాకిల,
శ్రీరమాపతీ॥ 51

ఉ॥ చిక్కని పాయసంబనగ ♦ జెల్లెడినీకథలేవినంగ, నీ
చక్కని నామమేను,మన ♦ సారగ గ్రోలగ గల్గుచున్,సదా
మక్కువదీరనాదు మన ♦ మూరగసంతసమొందుచుండగా।
తక్కిన వేల్పులెందులకు ♦ ధారుణినాకక, శ్రీరమాపతీ॥

చ॥ గురుతరభక్తిబూని, నిను ♦ గూర్మిభజించుసుధీవరుల్ తగన్।
గరమునద్రిప్పు ధాత్రివలె ♦ గాంతురునీఘనసత్ఫలంబు, నీ।

చరణవిదూరులై, యితర♦దైవములౌనర్చెడుమూఢమానవుల్
ధర, బలుబాములన్ బడుచు♦ధన్యతగాంచరు, శ్రీరమాపతీ॥

ఉ॥ మించినభాగ్యవంతుడవు ♦ మెచ్చగ జేతుపరోపకారముల్
మంచిగ నీదు భక్తులను ♦ మానకనీవెపుడుద్ధరించుచున్
వంచన జేయవేరినిక ♦ వందనముల్ గడునొందుచుంటెదా
యెంచగ నాదుపుణ్యమున♦నే నినుగంటిని, శ్రీరమాపతీ॥

ఉ॥ సారసనేత్ర, సద్విమల ♦ సత్యసుశోభిత, శాంతిభూషణా
వారకనెదు సేవకుల ♦ వాసిగగాంచుచుబ్రోచుచుందు, వా
భారముమీద వైచికొని, ♦భారమటంచన బోకయేయెడన్
నేరములేమి యున్ననిక ♦ నేమిగణింపవు శ్రీరమాపతీ॥

చ॥ సదమల భక్తియుక్తముగ ♦ శాంతిగుణాంచిత నిర్మలాత్మనై
వదలక, నాహృదబ్జమున ♦ వాసిగనిన్నురక్తినిల్పి, నీ
పదసరసీరుహంబులను ♦ బాయక నేముదమొప్పగొల్తు, శ్రీ
సదనవిశాలవక్ష! మన ♦ సారగబ్రోవుమ, శ్రీరమాపతీ॥ 56

చ॥ పరమదయార్ద్ర! నీదుపద♦పంకజముల్ గతియంచునమ్మి, నే
కరమనురక్తితోడనిను♦గాఢపుగూర్మి భజింపుచుంటి, నీ
కరుణ యొకింతజూపి, ఘన ♦కామిత సౌఖ్యములొందజేయు
చున్ । వరము లొసంగి, భాగ్యమిడి ♦ వర్ధిల జేయుమ,
శ్రీరమాపతీ॥ 57

ఉ॥ పాపపుకార్య సంగతుల ♦ బాల్గొని నేజరియించితీ భువిన్
నీపయి బుద్ధినిల్పి, కడు ♦ నేర్పుననిన్ స్తుతియింపనైతి, నన్
"బాపి,"వటంచు దూఱక, కృ♦పాజలధిన్ నను జేర్పుమయ్యా
నా। ప్రాపగు వేల్పునీవయని ♦ ప్రార్థన జేసితి, శ్రీరమాపతీ॥

ఉ॥ సేయుదునీదుపాదసర ♦ సీరుహసేవలనెల్ల పొంద్దులన్
వ్రాయుదు నీదుగీతముల ♦ బ్రాభవమున్ గననీదుసద్గుణలన్
బాయక పాడుకొంచు, నిను ♦ భావమునం దిడుకొందు
నయ్యా, । నా శ్రేయముజూపుమయ్యా, బుధ ♦ సేవ్యా !
శ్రీయుత ! శ్రీరమాపతీ॥ 59

శా॥ "నిర్వాకం"బడియెన్నరో, మోహాలనో,♦ నేనుంటినీకడను, వో
సర్వేశా! నిను, నమ్మగా, నెవ్వగదా!♦ సౌఖ్యంబులేదయ్యో! నా
కుర్వీన్, కష్టములేసదా, గలుగగా♦ నోర్వంగ నెట్లానికన్
సర్వజ్ఞుండవు, నీవెచెప్పగదవే!♦ సత్యాత్మలక్ష్మీపతీ॥ 60

ఉ॥ వేడిన, వేడినన్ గొలది ♦ వేడ్క-నినీకగుచుందుగాదె! నన్
గాఢపుజింతలన్ గొలిపి ♦ కష్టపరంపర లొందజేయ, నే
వేడగ బోనునిన్నికను ♦ వేడని వారలె, సౌఖ్యసంపదల్
జూడగబొందుచుందురిల ♦ జోద్యముగల్గెడు, శ్రీరమాపతీ॥

చ॥ అడిగినవెంటనే, యెవరి ♦ నైనను బ్రోచితి వయ్యనీవు? ని
న్నడుగుచు, బాములన్ బడుచు ♦ నారటజెంది, విసుగు
నొంది, యా। కడపట బ్రాణముల్, విడువ♦ గాదలపోయు

చునుండు వేళ, నే । వసువృస నోగడుగెను, ర ♦ నాత,
దలంపగ, శ్రీరమాపతీ॥ 62

ఉ॥ దూషణభూషణంబులను♦తోయజనేత్ర!సమానముంచు, నే
యీసడిముల్ మదిన్ గొనక♦యెంచవుదూషణ జేసిరంచు, నీ
భూషలునీక వేగసగ♦బుద్ధియు, శాంతియు, భూషవాక్య, వే
భాషలి కేలనో, యనఘ! ♦ భవ్యగుణుండవు, శ్రీరమాపతీ॥

ఉ॥ భక్తుల ప్రేమలన్ గొనుచు ♦ భావము సందున స తసిమ టే
యు క్షమటంచునె చి, యిక ♦ నూరకనుండుట నాయనూ
నుకో? ర క్తిగనీసుభక్తులను ♦ రాజులజేయుదుమూల నైత
మున్ । యుక్తముగాదె! నీకటుల ♦ నోములుకోపవు?
శ్రీరమాపతీ॥ 64

ఉ॥ తానక నామకీర్తనము, ♦ తప్పక బాడుదునుంటిగాదె, నే
తానక పాదపద్మముల ♦ ధ్యానము జేయుచునుంటిగాదె, స
ద్భావములొందగా, నెడద ♦ భావననిత్యము సేతుగాదె! నన్
బ్రోవగ రాగ జేయికను ♦ భూరిగుణాకర! శ్రీరమాపతీ॥ 65

ఉ॥ యుక్తమటంచు నెంచితివె? ♦యూరకనుండుట భక్తిపీడి, నీ
భక్తునిపీడియుంటినను ♦ భావమునీమది జింతగొల్పు, నన్
యుక్తతజూడ లేదనుచు ♦ నుమ్మలికంబికనాకుగల్గు, నీ
భక్తుని జేర్చ నీదటికి ♦ భవ్యమదిర్వరకున్, శ్రీరమాపతీ॥

చ॥ నయముగ నీముఖాంబుజము ♦ నారయుచుంటయెనాకు,
విందు, నే।నియమముతోడ వేడితిని ♦ నీరజనాభ, మదీయ
సేమ, మా।రయనికనీవెగాదె! గుణ ♦ రాజిత, పూజిత,
భవ్యతేజ! నీ।ప్రియమగు పల్కులన్ వినగ ♦ వేడుకనాకది,
శ్రీరమాపతీ॥ 67

చ॥ పరమదయాకరా! సుగుణ!♦భాస్కరతేజ, విరాజమాన! హే
సురుచిర, ధీవిశాల! మృదు ♦ సూక్తివిలోల, సుధర్మ
పాల! ఓ। దురితవిదూర! భక్తజన ♦ తోషణ, పోషణ!
మానిపాల! నే। శరణని మ్రొక్కుచుంటి, నిదె ♦ శాంతి
విభూషణ శ్రీరమాపతీ॥ 68

చ॥ నిరతమునీపదాబ్జముల ♦ నిక్కముగాభజియింపుచుంటి, నా
వెరపునుమాన్పుమయ్య, నిను ♦ వేయువిధంబుల బ్రస్తు
తింతు, నీ। కరుణయె, ప్రాపటంచు, గని ♦కాలమునేనెట్టు
చుంటి, నో। సరసిరుహాక్ష! నీకృపను ♦ జక్కగ
జూపుమ, శ్రీరమాపతీ॥ 69

ఉ॥ నీవచనామృతంబుగన ♦ నిండగు వీనుల విందునాకు, నీ
భావన యేసదామదికి ♦ భవ్యతనిచ్చుచు నుండునాకు, నీ
సేవయెగాదె, యెల్లపుడు ♦ సేమము, ప్రాపు, నొసంగు
నాకు, నన్। బ్రోవగనీవెగాదె! మరి ♦ బ్రోవగ నెవ్వరు?
శ్రీరమాపతీ॥ 70

చ॥ సిరిహృదయంబునన్ వరలు ♦ శ్రీధర! యీ భవసాగరంబు, నే।
నరయగనీ సహాయ్యమున ♦ నాన్యగనుంగొని యీదగల్గు
దున్ । విరివివరంబు గోరనిక ♦ వేడుక నీకృప యొందు
దక్క, న । న్నరమరలేక, జూచుచు, కృ ♦ తార్థను
జేయుమ, శ్రీరమాపతీ॥ 71

మ॥ మదమాత్సర్యములన్ జయింప, పృథుస ♦ న్మార్గంబులన్
జూపు, మో । సదయా! కంటికి ఱెప్పవై, యితర వ్యా ♦
సంగాల నేఁగాక, నా । హృదయంబందు త్వదీయనామము
ను నే ♦ నేవేళ సేవించి, నీ । పదరాజీవములంటి
భాగ్యమిడు ! నా ♦ పాలింటిలక్ష్మీపతీ॥ 72

చ॥ తనివిగ ధర్మమార్గము, ను ♦ దార! దయాదిగుణంబులున్,
సదా । దనరగ, సాధువర్తన, య ♦ థావిధిగానడుపంగ
జాలుచున్ । ఘనమగు నీదుభక్తి మెండు ♦ గారవమొప్పెడు
భాగ్య మిచ్చుచున్ । ఘన, ధన, ధాన్యసంపదల ♦ ప్రాల
గ జేయుము, శ్రీరమాపతీ॥ 73

చ॥ పటుతరభక్తి నీపదము ♦ బట్టగనెంచిన గానరావు, నీ ।
వెట జరియింతువో, యనఘ ! ♦ యేవిధి, నీపదమంట
సాధ్యమో, । కిటుకును దెల్పు, మానసపు ♦ కీరము నీపద
పంజరంబునన్ । దిటవుగ నుంతునేను, జగ ♦ తీధవ !
నిగ్గన, శ్రీరమాపతీ॥ 74

శా॥ నీవేతల్లివి, తండ్రివిన్, పతివియున్ ♦ నీవేమదీయాప్తుడున్
నీవేనాదగు బంధువున్, గురుడవున్ ♦ నీవేగదా, శ్రీకరా!
వేవేగన్ గరుణించి బ్రోవు, మనఘా! ♦ నీకన్ బ్రసన్నుండవై
శ్రీవైకుంఠనివాస! యా, శ్రితనుతా! ♦ శ్రీ లక్ష్మికాంతాపతీ॥

ఉ॥ శ్రీరమణీయగాత్ర, బుధ ♦ సేవిత పాత్ర, జగత్పవిత్ర, నే।
ధారుణి వాక్ప్రసూనముల ♦ దావక పాదపయోరుహంబు
లన్।గోరికదీర బూజలను ♦ గూర్మిని జేసి, స్తుతింపుచుంటి, దు।
ర్వార భయాంధకారముల ♦ బాపగ జేయుమ, శ్రీరమాపతీ॥

ఉ॥ భూములు పుత్రలిమ్మనుచు ♦ బూనికతో నిను గొల్వ లేదు, నే
నీమిత ధర్మకర్మలను ♦ నేర్పున జేయ, త్వదీయపాదముల్।
ప్రేమను గొల్చు భాగ్యమును ♦ బ్రీతిని నాకొనగూర్పు
మయ్య నే। నీమమునన్ భవన్నుతుల ♦ నెన్నడు వీడను,
శ్రీరమాపతీ॥ 77

ఉ॥ శ్రద్ధగనీదుపూజ, మరి, ♦ స్నానముసంధ్యయు, పెక్కు-
నీమముల్। తద్దయునర్థిపూజలును ♦ దానము, ధర్మపరోప
కారముల్। పెద్దగ జేయ లేను, నిను ♦ బ్రేమభజించెద
నంతెగాని, వే। రెద్దియు జేయలేను, నను, ♦ నెట్టుల
బ్రోచెదొ! శ్రీరమాపతీ॥ 78

చ॥ ఘనమగు సౌఖ్యసంపదల ♦ గంటిని, నీమకృపారసంబుచే।
వినుటకు నీమపల్కులవి ♦ వీనులవిందుగ దోచుచుండు, గారు

మనమునచింత వీడుగద! ♦ మానిత! నీదగు దర్శనంబుచే,
ననయమునిట్లుగల్గగన ♦ యమ్మనవేడెద, శ్రీరమాపతీ॥ 79

ఉ॥ పాలన జేయుచుండెదవు ♦ భక్తులనందఱ, నాదరించుచున్
ఆలనలందుచున్, మరియు♦నాపదలన్ గడవంగ జేయుచున్
శ్రీలను గూర్చుచుండెదవు ♦ చింతలనెల్ల దొలంగజేసె దా
మేలగునీదు త్యాగమిల♦మిక్కిలివంద్యము శ్రీరమాపతీ॥. 80

ఉ॥ భూషలగౌరవయ్యె తల ♦ పోయగనెంతవిరాగివౌనొకో! యే
వేషము గొంపివెపుడు ♦ వేడుక సత్య సుకీర్తితప్ప, యే
యూసయులేదు చూడగ, ను ♦ దారసధర్మసుబుద్ధితప్ప, వే
భాషలనంగనేల, బహు♦భాగ్యమునీకవె, శ్రీరమాపతీ. 81

చ॥ ఘన ధన ధాన్యసంపదలు ♦ గల్గుటలేదను చింత, గల్గినన్
తనకవిచాలవంచు, మఱి ♦ దాగడుచింతలగుందు, చాలినన్
వినుమికదాచచింత, యది♦ప్రీతిగసద్వినియోగమౌనొకో!
యనియెడుచింతగొల్పు, ధన♦మందఱకేయెడ, శ్రీరమాపతీ!

చ॥ అగణితమంజుభాష, శర♦ణాగతపోష,సురేంద్రతోష యో!
జగదభిరామవేష, పృథు♦శాంతవిభూష, కృపామనీష,యో
విగత సమస్తదోష, ధర ♦ విశ్రుత కీర్తివిశేష శ్రీరమా
భగవతి, నీదువక్షమున ♦ భాసిల బ్రోవుమ శ్రీరమాపతీ॥

శా॥ సంసారాంబుధి నోలలాడగ, నిమే ♦ సంబేని తెన్నుండునో?
హింసాబంధురమౌ, యవస్థలవి, యొంతే నోచవేలేది ?

నీ సంసర్గంబును బొందుచున్, మదిని నే ♦ సంతోషమొం
దంగ, నన్ । సంసక్తిన్ గని, ప్రేమ జేకొనుమ, హే ♦
శాంతాత్మ లక్ష్మీపతీ॥ 84

చ॥ నిరతము మోహపాశముల ♦ నీ భువిబందిగనుంటిగాని, నీ
పరమపవిత్రి నామమును ♦ బల్కుటుదల్పగ బాశముక్తనై,
ధరణి జరింపగల్గితిని ♦ ధన్యుడటంచుమదిన్ దలంతు,నీ
చరణయుగంపు సేవలను ♦ జాలను మానగ,శ్రీరమాపతీ॥

చ॥ తపములుజేయుకంటె, మరి ♦ దానము ధర్మపరోపకార
ముల్ । విపులతజేయుకంటె, భువి ♦ విశ్రుతకీర్తిగణించు
కంటె,తా । కపటమువీడినిత్యమును ♦ గల్మషదూరుడుగాగ
నున్న,నీ । కృప బడయంగవచ్చు, గద ♦ కిల్బిషఖండన,
శ్రీరమాపతీ॥ 86

ఉ॥ ఎంతని వేడుకొందు, నిక ♦ నెమ్మెయి నీకృప నేనుగందు, నీ
పంతమి కెంత మట్టుకు, ర ♦ వంతసుఖంబొనగూర్పరాదె! నే
సంతసమొందుచుండగను ♦ సాదర మొప్పగజూడలేవె?
యా।వంతదయారసంబునిక♦ నైననుజూపవె? శ్రీరమాపతీ॥

చ॥ వరదుడవంచు మున్ను బుధ ♦ వర్యులుపల్కగ నిన్నుబట్టితి
ద్ధరణిభవప్రభావములు ♦ ధర్మవిరుద్ధముగాగదోచు, నీ
చరణములాశ్రయింపగను♦సౌఖ్యమునాకొనగూర్తువంచు నే
కరణిని నమ్మగల్గుదును ♦ గాఢముగామది, శ్రీరమాపతీ॥

ఉ॥ శ్రీరమణీకళత్ర, నిను ♦ చిత్తమునందున గొల్చుచుంటి, నే
ఘోరుణి జేయు పాపముల♦దాహము జేసి, దయార్ద్రదృష్టితో
వారకనన్ను జూచి, ♦ హితభావమునన్ దగ బ్రోచి, తృప్తి
యున్ । ధీరతనిచ్చి బ్రోవు, జగ ♦ తీధవ! వేడితి, శ్రీ
రమాపతీ॥ 89

ఉ॥ భేదము లెంచకీవెపుడు ♦ ప్రేమవహింతువు భక్తకోటిపై
బోధల వెన్నొ జేయుచును ♦ పోడిమి జూపుచు లోక
మాతటన్ । మోదమునొందెదా, మరియు ♦ మోదము
నిత్యము నిచ్చుచుండెదా । భూతదయాపరుండవుగ! ♦పూత
గుణాన్విత, శ్రీరమాపతీ॥ 90

చ॥ అనవరతంబునీపద, స♦మాశ్రయమిచ్చుచు, సంతసంబునన్
ఘనతరధర్మమార్గముల♦గాంచగ జేయుచు, ధన్యజేసి, నిన్
వినయుత, భక్తిగొల్చు, పద♦విన్ మనమందున నాటజేసి, న
న్నవయము బ్రోచి నీకృప స♦నారతమీయుము, శ్రీరమాపతీ॥

ఉ॥ తారకనామ, నాదుమది ♦ దావలమైవసింపించి, విద్యవి
స్తారముజూపుమయ్య, నను♦ధన్యనుగా భువి జేయుమయ్య,
నీ । చారుదయార్ద్రదృష్టి, సతి ♦ చక్కగజూపుచు, మాతృ
భాష జే। కూరగజేయుమయ్య, నిను ♦ గూర్మిభజించెద,
శ్రీరమాపతీ॥ 92

ఉ॥ ధర్మము నీవెయయ్యెద వ ♦ ధర్మములన్నియునీవెయౌదు; వా । మర్మములన్నినీవెఱుక ♦ మర్మము లేమియు నీవుగావు స । త్కర్మలవన్ని నీవె, మఱి ♦ కర్మలవేవియునీవుగావు,నీ మర్మములన్ని నాకెఱుక ♦ మాటలికేటికి, శ్రీరమాపతీ॥93

ఉ॥ ఇంతగ వేడుచుంటినని ♦ యీసుదలంపగ న్యాయమౌన?నా వంతలబాపుదైవమని ♦ వాసిగనిన్ భయభక్తి నామదిన్ । సంతసమొప్పగొల్వగను ♦ సమ్మతితో ననుజూడలేవె? నీ. స్వాంతమునందునన్ను నిడి♦సౌఖ్యములీయుమ, శ్రీరమాపతీ॥

చ॥ గిరులును వృక్షరాజ, భుజ ♦ గేంద్ర, మృగేంద్ర, సమీర సంద్రముల్ । పరుగిడుమేఘముల్, దివిని ♦ బారులుదీర్చిన తారకాళి, సుం । దరతర వస్యభూములును ♦ ధారుణి నీవుసృజించితౌర! య। బ్బురమగునీదు సృష్టిగన ♦ భూతల మందున, శ్రీరమాపతీ॥ 95

శా॥ గోపాలా వసుదేవనందన హరీ ♦ గోవింద మాంపాహి!నా ప్రాపీవేయని నమ్మియుంటినిగదా ♦ రామాజగద్బాంధవా! యాపాంచాలికి దోడునీడవయి, నీ♦వాత్రిన్ బ్రసన్నుండవై నీప్రేమన్దగజూపి, గాచితివి నే ♦ నీదాన, లక్ష్మీపతీ॥ 96

చ॥ ఘనమగునీదుచెల్మి, భువి ♦ గాంచుట యే, పదివేలునాకు, నో । వినుత గుణాఢ్య, నీకృపను ♦ వేడ్కనుబొందుట

మేరు వేక్కుచే । అనయమునీవు పల్కుచవి ♦ యబ్బుర రమా
ఘన పెన్నిధానమే । వినుమికనీవు చెల్మినిల ♦ వీడను,వీడను
శ్రీరమాపతీ॥ . 97

ఉ॥ శరణిదె, లక్ష్మికాంతనుత♦ శాంతసుశోభిత,సచ్చరిత్ర, మో
పరమదయాళు!నీదు ♦ పద్మయుగంబున జేర్తువంచు, నా
కరములభక్తి పెంపొద్విమది♦గాటపుకూర్మి భజింపుచుంటినే
మరకుమ, నీవుభక్తనిక ♦ మర్మమెఱుగను, శ్రీరమాపతీ॥

ఉ॥ సేమముగూర్పుమెల్లెడల ♦ సేకుర జేయుము, శాంతిసౌఖ్య.
ముల్ । నీమము దప్పకుండగను ♦ నీమితధర్మము లెల్లవేళ
లన్ । సేమముగాగ జేసికొని ♦ శ్రీలను నేగన జేయుమీ
యెడన్ । నేమనముందు గొల్తునిను ♦ నెయ్యముతోడుత,
శ్రీరమాపతీ॥ 99

చ॥ శతకముజేసి, యివ్విధిని ♦ సన్నుతిజేయదలంచి, నామదిన్
అతులిత మోద మొంది, యిక ♦ నన్యముగోరక భక్తి
పెంపునన్ । గృతినిడుచుంటినయ్య, కడు ♦ గూర్మినినంది,
శుభంబు గూర్చుచున్ । హితపుగ నీ కృపారసము ♦ నిం
పుగ జిల్కుమ, శ్రీరమాపతీ॥ . 100

మ॥ జననం బిచ్చితిసద్యశోయుత సదా ♦ చారాన్వితంబౌ కులం
బున జేకూర్చితి వీవు నాకు సుగుణా ♦ పూర్ణున్ గృపా
సాగరున్ । మనమందున్ సుఖమిచ్చుభర్తృప్రియును, స ♦ న్మా
నంబు సౌభాగ్యమున్ । గన సయ్యెన్ గద ! యంచితంబు।
సదె, శ్రీ ♦ కాత్యాయనీ, నీ దయన్॥ 101

శ్రీ॥ గిడుగు లక్ష్మీ కాంతం.

---

శ్రీ

# లక్ష్మీశారదా శతకము

## "శ్రీ శారదా" పతి శతకము.



మ॥ భవదాశీర్వచన ప్రభావరస మా ♦ స్వాదించుటం జేసి, నా
కవితాకోర్కెలు పల్లవింప, బడముల్ ♦ గల్పింగ నయ్యెన్,
జుమీ । నవనీతంబగు నీదుమానసమునా ♦ నందంబు
నొందింప, నీ । యువతీరత్నము, శారదాంబయిదె వ్రా ♦
యున్, శారదాంబాపతీ॥ 1

ఉ॥ వందనమేను జేతు, బుధ ♦ వందితుడాశ్రిత రక్షకుండు, మా
యిందు ధరేంద్రనందను, స ♦ నేకవిధంబుల బ్రస్తుతింతు
నా । డెందమునందు నిల్పుచు, వ ♦ డిన్ వర వేర్పగ కార్య
సంతతుల్ । పొందుగ ముందె వేడెదను ♦ పూతచరిత్రుని,
శారదాపతీ॥ 2

చ॥ సదయుత నాహృదబ్జమున ♦ సాహితికన్యసముద్భవింప, నే
మృదుమధురంపుబల్కులను ♦ మెలుగ నామెకు నుగ్గువెట్టి, స
త్పదముల నేర్పి, యావలన, న ♦ వాంగనగా నొనగూర్చి,

యిచ్చితి । మ్మదిత, గుణాలవాలను, న ♦ మూల్యపు
గాంతను, శారదాపతీ॥ 3

ఉ॥ సీతముతోడ భాషకవ ♦ నిన్ బహు భాషలొసంగినట్టి,సు
ప్రీతలు, మొల్ల, ముద్దుపళ ♦ వేకమలన్, మదినొతు,
పూతలా । సీత, శకుంతలాది, విదు ♦ షీమణులన్ మన
మందుగొల్చెదన్ । పూతచరిత్ర ! భావముల ♦ బుట్టగ జే
యుమ, శారదాపతీ॥ 4

చ॥ కలువల, బువ్వసంతతుల ♦ గ్రన్నన జేర్చిక నీదుపూజలన్
సలిపెద భక్తితోడ, నిను ♦ సన్నుతిజేసెదనయ్య, నిత్య
మున్ । సలుపుముసాయ సంపదల ♦ చక్కనిభావములిచ్చి,
వాక్కునన్ । జెలువుగనుండి, విద్యలను ♦ జేకురజేయుము,
శారదాపతీ॥ 5

చ॥ మిడిమిడి జ్ఞానమున్గలుగ ♦ మేరువుపర్వతమెక్కినట్లు, నే
వడివడి పద్యమల్లి, నిను ♦ వర్ణనజేసి నుతింపుచుంటి, నన్
గడువడిప్రేమ జూచి, యిక ♦ గల్గెడు వ్యాకరణాది దోష
ముల్ । విడచెవిజెట్టి, తద్రసము ♦ బ్రీతిగ్రహింపుమ,
శారదాపతీ॥ 6

చ॥ చదువగలేదు గ్రంథముల ♦ శాస్త్రములన్ గ్రహియింప
లేదు, నే । జదువగలేదు, లక్షణము ♦ సంస్కృతమేమియు
నాకురాదు, నా । మొదనుదయించెనిన్ను నుతి ♦ యింపగ

గోర్కిమరేమిగోర, నన్ । సదయత జూచి, తప్పులను ♦
సైపగదేయిక, శారదాపతీ॥ 7

ఉ॥ సదమల సచ్చరిత్ర, బుధ ♦ సన్నుతిపాత్ర, పవిత్రగాత్ర శ్రీ
యుదధినివాసపుత్ర, పురు ♦ హూతసుమిత్ర, సరస్వతీసతీ
హృదయనివాసమాత్ర. పృథి ♦ వీస్థలినేత, విశాలనేత్ర, నీ
పదసరసీరుహాంబులను ♦ బట్టితి, పాడితి, శారదాపతీ॥ 8

ఉ॥ క్షితితలనాథుడీవె, కడు ♦ చిత్రవిచిత్ర సుకల్పనాళిచే
వితత విరాగివీవె, నిక ♦ వేనిని, నీవెపుడంటకుంటచే
అతులితభోగివీవెగద! ♦ యన్యములేవియు గోరకుంటచే
హితమతి వీవెయందఱకు♦హే, సుగుణాకర! శారదాపతీ॥ 9

ఉ॥ పండితవర్య నిన్నెపుడు ♦ భక్తిగగొల్చుచునుంటిగాదె, భూ
మండలమంత, యేగినను ♦ మానకనిన్నెడ బాయకుంటి, నీ
యండను జేరియున్ననను♦నాదరమొప్పగ జూచుటొప్పదే?
మెండుగ, వేడజాలనిక♦మేలుగ జూడుము, శారదాపతీ॥ 10

ఉ॥ నయముగనీ ప్రసన్నవద♦నమ్మగు నాకనుదోయి విందు దు
ర్నయహారమా, తదీయపద♦రాజితపాంశువెనాకు మందదే
నియతినినైన నన్ననుము ♦ నీపనులన్నిటికంటెముందు, నీ
ప్రియమగు పల్కునాకెపుడు♦వీనులపండువు, శారదాపతీ॥

ఉ॥ నీవుసృజించినట్టి కమ ♦ నీయమనోహరభాగ్యభోగ్యముల్
నీవశమౌట లేదవియు ♦ నీకును భోగ్యము లౌటలేదు, సం

భావనజేసి, సేనితర ♦ భాగ్యముగోరిన లాభమేమి, స
ద్భావముగూర్చినాకిక,ము♦దంబానగూర్పుమ శారదాపతీ॥

ఉ॥ వ్రాతలువ్రాసెదా, మిగుల♦ప్రాజదువుల్ చదువంగనేర్చితీ
వాతతదీక్షబూనుచు, న ♦ యాచిత చిత్రవిచిత్ర కల్పనల్
నీతముతోడజేసెదవు ♦ నీదగుభావము తేటగాదె. కీ
భూతలమందునేరికవి ♦ బోధకమౌనొకో! శారదాపతీ! 13

ఉ॥ కారణమారయుంగ, బహు♦కష్టముఃకష్టము, నీదుచర్యకున్
భారమనంగబోవు, భువి♦భాగ్యము లెవ్వియుగోరబోవు, నీ
శారదకూడనీకతగు ♦ చారుసుగీతవినోద మొందుచున్
గోరదు సౌఖ్యసంపదలు ♦ కూర్చుటనీకదె, శారదాపతీ॥

ఉ॥ విన్నదదల్చువారలును ♦ నీకొఱకై, మది చింతజేయువా
రెన్నగనేరులేరు, గద ! ♦ యేకడజూచిన గానరారు, నీ
యున్నులమిన్న, శారదొక ♦ యంగనదప్ప, దలంపరెవ్వ
రున్ ।మొన్నగ, నానెలంత, సతి♦నేనియుజీరవు, శారదాపతీ॥

ఉ॥ ఎచ్చటనుండిరెూ, మిగుల ♦ నెవ్వరొ వ్రాతలువ్రాతు
గాని నీ। విచ్చటనుండి వ్రాసినను ♦ వీలగునట్లుగ వ్రాయ
జేయమే, । నచ్చవికేరి యోచనలు ♦ నచ్చును నీ
కవి తోచినట్లనే । జెచ్చెఱజేతు వంత్కై, యిక ♦ జెప్పన
జేటికి, శారదాపతీ॥ 16

॥ వ్రాతలు వ్రాయగల్గుటకు ♦ వ్రాసెడిలేఖని, నీయధీనమే
ప్రోతగ, నేతగన్ మఱియు ♦ భూరిసుకల్ప వికల్పనాదులుఁ
నీతరమౌనుగాదె, యిక ♦ నేనినుఁగోరినరీతి వ్రాయఁగన్
నీతము నాకు జేయుమిక ♦ నేమని వేడుదు, శారదాపతీ॥

॥ పట్టినదాది, నీదుపద ♦ పద్మములేగతియంచు నాత్మలో
గట్టిగనమ్మియుండనను ♦ గాసిలజేసి, కృశింపజేయ, నే
నెట్టులనోప గల్గుదును ♦ నీసుజనించె, విసుంగుగల్గె, నన్
బుట్టగజేసి యెందులకు ♦ భూతలమందున, శారదాపతీ॥ 18

॥ ఆపదలందు బంధువని ♦ యార్యులు, వల్కగ నేను వింటి, నే
నాపదలందునుంటి, నిక ♦ నమ్మము నీకును నాకు జెల్మి, నా
ప్రాపగుబంధువీవె, నిను ♦ బట్టితి వీడను, వీడనింక, నీ
దాపున జేర్పుమీ నను,ను ♦ దారగుణాకర, శారదాపతీ॥

॥ నీసరివారులేరనుచు ♦ నేమదినెంచుచు నిన్నుగొల్చితిన్
నాసరిదానగావనుచు ♦ నన్విడబోకుమ, నాయమానిశో!
వేసటగల్గజేయకుమ ♦ వేమరువేడగ, నీపడింపకే
దాసిని బాదుచుంటిగద ♦ తావక నామము, శారదాపతీ॥

॥ సదమల భక్తితత్పరత ♦ శాంతితమోగుణ సద్గుణంబులున్
చెదరని మానసంబు, కడు ♦ సేమము నాకొనగూర్చి, నామనో
సదనమునందునిల్చి, సుఖ ♦ సంపదగూర్చి, సుభాగ్య
మిచ్చి, నామదివిమలంబొనర్చి, నను ♦ మాన్యత జూడుము,
శారదాపతీ॥ 21

మ॥ అనుమానంబులనన్నిటిన్ విడచి, ధా ♦ త్మాన్ సదా
యోచు నే । నిను ధ్యానించుచు, నుండెదన్, మదిని,
మో ♦ నీరేజపత్రేక్షణా । జనితానందము మీఱ, నీపద
ములన్ ♦ సద్భక్తి పూజింప, నా।ఘన పాపంబులికంతరించె
డుగదా! ♦ కాపాడు వాణీపతీ॥ 22

చ॥ తపముల జేయలేనన ఘ! ♦ దానములీయగశక్తి లేదు, పా
ప పుజలడాత్మ నింకను ప ♦ వాసజపాదులు సల్పలేని, కే
నెపమున నన్ను గాచెదవొ! ♦ నీదయగల్గభయంబు లేదు, నా
చపలత బాపి సత్పథము ♦ జయ్యన జూపవె; శారదాపతీ॥

చ॥ అగణితశాంతభూష, దురి ♦ తౌఘ వినాశ, జయప్రదాయ
కా। నిగమసమూహరక్ష, తరు ♦ ణేందు నిభాస్య, సరస్వతీ
సతిన్। సుగుణవిలాసభాసినిని ♦ శోభనగాత్రి గ్రహించి
తయ్యా, యీ। జగతియెనీకు మందిరము ♦ చారుగుణాకర,
శారదాపతీ॥ 24

చ॥ పరమ దయాళు వార్తజన ♦ పాలిటిపెన్నిధివంచు, నిన్ను
నే । కరమనురక్తివేడ, కని ♦ కారము జూపవు, కష్టజాల
ముల్ । తరమెుఖరింప, నాతలకు ♦ బాటె, భరింపగలేను
సుమ్మి, నే । బరువౌ? భరింపలేవె? పెర ♦ వాడవె వీడగ ?
శారదాపతీ॥ 25

ఉ॥ చెచ్చెర ద్రవ్యమిమ్మనను ♦ చేర్పఘనంబగు సౌఖ్యసంపదల్
హెచ్చుగ గోరలేదికను ♦ హేమమయాంచిత సౌధరాజముల్

పెచ్చుగ నాదు ప్రార్థనము ♦ ప్రేమనుగైకొని, ప్రీతి
జూడుమా। సచ్చరితంబు నీయదియె ♦ సత్యసుశోభిత,
శారదాపతీ॥ 26

॥ శారద నేలెదంచు మది ♦ శంకను వీడి చరించుచుంటి, నా
భారము నీదెయౌనుగద ♦ పాలనుముంచిన నీటముంచినన్
గారవ మొప్పగాంచుమిక ♦ కల్మషదూర! కడింది వేడితి
న్నేర మొనర్చి యుండినను ♦ నేమిగణింపకు, శారదాపతీ॥

ఉ॥ నీదగుకల్పనాది బహు ♦ నీమములన్ గొని, లోకమంత
యున్ । ఆదర మొప్ప సౌఖ్యముల ♦ నందుచునుందురు
గాదె! కల్పనా । బాధల మున్గియుండి, భువి ♦ భాగ్యము
లెవ్వియుగోరవార! హా!। నీదగుత్యాగ మెంతయును ♦
నిక్కము, వంద్యము, శారదాపతీ॥ 28

ఉ॥ కోరగనిత్తువే, చిఱుత ♦ కోర్కెల, నిచ్చిన, నిచ్చెదాసు
మా । ఘోరతరంబులై, ప్రజల ♦ గోలగలంగగ జేయునట్టి,
వి । ద్దూరము, లౌర ! నీకృతము ♦, లూరకపోవున? వాని
దిద్దగా । భారము నెత్తి వైచికొని ♦ బాధకరావలె, శార
దాపతీ॥ 29

ఉ॥ భక్తులమంచు జేరి, కడు ♦ భక్తినిజూపి, సలాము జేయుగా
శక్తికి మించుదానమిడి ♦ సేమముగూర్చ దలంతు, వారలే

యుక్తిని బాధజేతురిక ♦ నుర్విని, నీదగు దానబల్మిచే
భక్తికి బొంగిపోయెదవు ♦ భంగమునీకదె, శారదాపతీ॥ 30

ఉ॥ ధాతవునీవయౌదు, విక ♦ దానములద్భుతమౌనుగాదె, నీ
చేతకుమించనిచ్చి, మరి ♦ జేయునదేమియు లేక చింతచే
నాతురతన్ గృశించెదవి ♦ కావిధిగష్టము లొందుచుందు,నీ
నీతము లెంతవింతయొకో! ♦ నీకదె సౌఖ్యము, శారదాపతీ॥

చ॥ అతులితభోగభాగ్యముల ♦ నందజకున్ గలుగంగజేసి, నీ
యతివకు శారదాంబకొక ♦ యందపు,తంబురకొయ్యనేగదా!
సతతము బాడుకొమ్మనుచు ♦ సంతసమొప్పగనిచ్చినావు, నీ
వితరణమొంతగాబొగడ ♦ వీలగునీభువి, శారదాపతీ॥ 32

ఉ॥ ఇచ్చిన కొయ్యనైకొనుచు ♦ నింపుగదృప్తినిబూని, యామె
నిన్ । మెచ్చుచు బాడుకొంచు నిను ♦ మెచ్చగచేయును;
యుద్ధియేగదా! । యిచ్చినదానికిన్ ఫలిత ♦ మీకిరియా
జల్పుట! తృప్తినొందు, నీ । నెచ్చెలినిన్నుమించె, యిక, ♦ నే
మనివేడుదు? శారదాపతీ॥ 33

ఉ॥ తీరికనుండవీవెపుడు ♦ దేశపరిస్థితి చింతనంబుచే
గోరవు సౌఖ్యమేదియును ♦ కూరిమి సత్యాసులోకపాలనం
బారయ జేయుచుండెదవ ♦ హర్నిశమున్ కమలావరాం
ఘ్రిసేసే । వారతినుండు నిన్నుగద ! ♦ భక్తుడనందగు
శారదాపతీ॥ 34

ఉ॥ నిద్దురహారముల్ విడచి ♦ నిత్యమునీదగు కల్పనావిధా
బద్దిర! చేయుచుందు, వది ♦ యబ్బురమాగద నీదుదీక్ష! నీ
గద్దియపీడకుండగను ♦ గాసిలిజెందక వ్రాయుచుండెదా,
తద్దయువేడ్కనీకదియె ♦ తథ్యము, నిత్యము, శారదాపతీ॥

ఉ॥ వేదములన్ బఠించుచును ♦ వేడ్కను బోధ దెదవెంతవింతయో!
బాధలు లేవు నీకికను ♦ భారతి నీవటు ప్రేమ జూచుటే
భేదమనంగబోవు, భువి ♦ బీదలపాలిటి కల్పభూజమై
బాధలనెన్నొ యోర్చెదవు ♦ భావముదిట్టము, శారదాపతీ॥

చ॥ చదువులు పెక్కునేర్చితివి ♦ సాహితికన్యవరించెనిన్ను, నీ
చదువిల యెంతవింత! కడు ♦ చక్కని భాషకువన్నె దెత్తువే
విధినిక నీదుకల్పనల ♦ వేమరు వర్ణన జేయగల్గుమున్
మది దలపోయనీమహిమ ♦ మానితయోగ్యము శారదాపతీ॥

ఉ॥ అర్థముగోరవయ్య పర ♦ మార్థమె, జీవనమందువయ్య, నీ
స్వార్థముగోరకే, మరియు ♦ సౌఖ్యముగోరకెమించుకాలమున్
వ్యర్థముజేయవయ్య మరి ♦ యా, కల, మద్దిర! వీడవయ్య, నీ
స్వార్థపరిచ్యుతీ, యిలను ♦ జక్కగనున్నది శారదాపతీ॥ ౩౯

ఉ॥ హారమునంగబోవ, విక ♦ నన్యులభాషలనాలకింప, వే
వేరెఘనంబుగోరవుగ ! ♦ వింతగునీచరితంబుజూడ, నీ
శారదకన్యకన్ దరిని ♦ జక్కగజేర్చుక ముచ్చటాడుచున్
సారసుగీతమెప్డు, మన ♦ సారగ గ్రోలెదు, శారదాపతీ॥ ౪౦

ఉ॥ చిక్కిన భక్ష్య భోజ్యముల ♦ సేమఃసుగా భుజింపఁజాల
గల్గెదా। అక్కట! లేనిచో లవణ ♦ మన్నమె ప్రీతిభుజింప
నెంచెదా। చక్కని పాన్పు లుండినను ♦ సంతసమొప్పు
సుఖింపగల్గెదా। నిక్కము,చిక్కకున్న,ధర ♦ ణీస్థలి నేని సు
షుప్తి జెందెదా। మక్కువ నివ్విధిన్ భువిని ♦ మాన్యత
నొందెను, శారదాపతీ॥ 40

ఉ॥ భూషలగోరవెన్నడును ♦ పొందుగజ్ఞానసుభూష దప్ప,యే
వేషము గోరవీభువిని ♦ పేకనుసత్య సుభాష దప్ప, యే
యూలసనొందబోవుగద ♦ యార్యహితంబగువృత్తిదప్పసం
తోషము నొందుదీవు, బుధ♦తోషణ,భూషణ,శారదాపతీ॥

ఉ॥ ధర్మసుకర్మ రక్తియు, ను ♦ దారగుణా న్వితభావరక్తి యే
మర్మములేకభక్తులను ♦ మన్ననజేసెడు మాన్యమూర్తి హే
నిర్మలకీర్తివంత, బహు ♦ నీతిసుశోభిత సత్యమూర్తి, స
త్కార్మ్య సుమార్గవర్తి,సిత ♦ కాంతిసుభద్రప్రద, శారదాపతీ॥

ఉ॥ నీరజనేత్రనాకొసగు ♦ నెమ్మనమందున దృష్టి, భక్తియున్
శారదగానలోల, తను ♦ సౌఖ్యములొందగజేసి,యీభవో
ద్ధారణ జేయ వేడెదను ♦ దాతవు, తల్లివి,తండ్రివీవె, నా
నేరక జేయు తప్పులను ♦ నీవె క్షమింపగ, శారదాపతీ॥

ఉ॥ చిన్నతనంబునుండి, నినుఁ♦జేరి, స్మరించుచునుంటిగాదె,యా
పన్నశరణ్య! శారదపతీ♦పాదమునాగభయంబు నొంది యే

తెన్నునుగానలేక, కదు ♦ తేకువదప్పిన పాంథురీతిగా
నున్ననశెట్లు బ్రోచెదవొ! ♦ యోకరుణానిధి! శారదాపతీ।

శా॥ నాకాంతుండవు నాకుబంధుగురుడౌ ♦ నాతోడు నానీడ,
వం। చే కాలంబున గూర్మినిన్ దలచెద♦ న్నీవే శరణ్యాంబు
సా। నీకన్ బ్రోచి, సుభాగ్యమీయు, మదియే♦వేవేలు,
నాకిచ్చుటల్। శ్రీకారుణ్యపయోనిధీ గుణనిధీ♦ శ్రీశార
దాంబాపతీ॥ 45

ఉ॥ దూషణశేసితంచు, నను ♦ దూరగఁజోకు, త్వదీయభక్తినే
వేషముపై చియూడినను ♦ బ్రీతియె, నీకది, సంతసంబె వే
భూషలనిచ్చినట్లు మది ♦ బొంగెదనీదగు ప్రాపుగల్గ, వే
భాషలికేల? నిన్నునయ ♦ భక్తినిగొల్చెద శారదాపతీ॥ 46

ఉ॥ కామము, క్రోధలోభముల ♦ ఖండనజేసి, త్వదీయభక్తిమై
ప్రేమజెలంగజేసి, కడు ♦ పెంపున దీనజనావళిన్, సదా
నీమముతోడ జూచి కడు♦నేర్పునబ్రోచి, నయంబుగూర్చి ని
ష్కామమనంగనిచ్చుబోడ♦గాంచగనీగదె! శారదాపతీ॥ 47

చ॥ వినుమిక నీవుపల్కనది ♦ వేదము, పాడగ గీతమాని, కే
మనదగునీకు చైదకులు ♦ వన్నియుసృష్టికి కల్పనంబులే!
కనగల వింతలన్నియును ♦ గాంచగనీకడనున్నవయ్య! నీ
వనునదియేటియనాను, మరి ♦ పాడగ, పాటతెము,
శారదాపతీ॥ 48

చ॥ ధనయుతసౌఖ్యసంపదలు♦ తండ్రులుతాత సతీయుతంబులై
మెనగల సౌఖ్యమొందగను ♦ నెన్నగవారి యదృష్టమం
దు రే! । తనమది జింతగల్గినను ♦తప్పగ ధాతయె వ్రాసెనం·
దు రే! ౯ మనుజులకోర్పు లేక, ఘన ♦ మాన్యులనందురు
శారదాపతీ॥ 49

ఉ॥ అందురు నీదు లేఖనము ♦ నందున, మార్పుల జేయవచ్చు!
నిన్ । గొందలమంది వేడినను♦కోరిభజించి, నుతించి, పిల్చి
నన్ । మొదులకిట్టి వాదికను? ♦ మొంచగ లేఖని చేతిలోని దే·
పొందుగమార్ప జూడుమిక ♦ పుణ్యసుశోభిత శారదాపతీ॥

ఉ॥ నిన్నిలవేడ నేమి ఫల ♦ మీయము? జేసెదుగాని కల్పనల్
మన్ననజేసి వేడినను ♦ మార్తువ? గూర్తువ? నీదువ్రాతలన్
నిన్నడుగంగబోనికను ♦ నీకికనచ్చినరీతి వ్రాయుమా
చెన్నుగ నీదులోకమున ♦ సేమముగాంచుమ, శారదాపతీ॥

ఉ॥ వ్రాసినవ్రాతమార్తువను ♦భ్రాంతియొకింతయు లేదునాకునా
యాసను గొల్వగాదగిన ♦ యాశ్రితపోషకుడీవుగావు, నీ
వేసముమార్చి, లేఖనికి ♦ వింతగనీవికగ్రొత్తవ్రాత, లా
వేళము జేయకుండగను ♦ వేడుదునిన్నిక, శారదాపతీ॥ 52

చ॥ కలుములు లేములున్ మొదలు♦గాగలనీదగు కల్పనంబులన్
బలువిధవైపరీత్యములు ♦ పల్మరు గన్పడుచున్న వే! పదా
సలుపగనిట్లునీకదిదొ, ♦ సంతపమా? తగుధర్మమార్గమా ?

తెలియగ జెప్పుమందుమని ♦ తేలిక జేసెదమంచు, నీవిటన్
జెలువుగ గానిపించవుగ! ♦ చిన్నతనంబా! భయంబా!
చింతయో!! నిలబడి చెప్పుమా, యికను♦ నీవెటుబోయెదు?
శారదాపతీ॥ 53

చ॥ ఇలగలమందభాగ్యులకి ♦ కేమియుజేయగ లేక, వింక, తా
మలసత జెందకుండగను ♦ నాసలగల్పనజేసి యిచ్చెదా
గలుగును ముందునీకనుచు ♦ గల్గునో గల్గదో! నీవు
మాయలు! చెలియగ నేరి శక్యమగు ♦ దెల్లముసేయుము,
శారదాపతీ॥ 54

చ॥ కరుణయొకింత లేక, యావు ♦గాదను యోచన సుంత లేక, భా
సురమతి దెల్పబోక, మది♦ చొప్పుగ్రహింపగ వీలునీకయే
మరుపున డాగియుండెదవొ!♦మార, సుధీవవర! భక్తకోటినీ
వరమర జేయుచుంటి విక ♦ నాదరముంచక శారదాపతీ॥

చ॥ పిలచిన బల్కకుంటివిక ♦ పెక్కగు బాధల జిక్కియుంటివో
సలుపగ సామసంపదలు♦ సాయమి కెవ్వరు లేక, నొంటరిన్
సిలుగుల జెందుచుంటివో కొ!♦ జేసెడి దేమియు లేక, లేనిచో
తలపగ భక్తురాలిపయి ♦ దప్పుల నెంచితొ శారదాపతీ॥

చ॥ కనబడ ప్రేమపాశముల ♦ గట్టిగకట్టెద నంచు నెంచితో?
వనరుగ నీవు చిక్కనను ♦ వంచన జేసెద నంచు నెంచి, నీ
మనమున చింత జేసితివొ! ♦ మన్ననజేయుక భక్తి పీడితం!
చనువుగ జెప్పుమీ వికను ♦ నాదరముప్పగ శారదాపతీ॥

ఉ॥ ధాతవు, నీవువ్రాసినది ♦ తప్పకమార్పవటంచెరుంగుదున్
నేతవుగాన, భావివిధి ♦ నేనియు నేతగగోరి నట్లుగా
నీతముసేయుదంచు, కడు ♦ నేర్పునవేడితి, జూపి తీవ్రతన్
బ్రీతినివేడుభక్తుకది ♦ ప్రేమసుభావము, శారదాపతీ॥ 58

ఉ॥ తీవరభావమున్ గదుర ♦ దీవ్రతజూడకు ధీవిశారదా
యేవగనైననన్ దరిని ♦ నేపుగజేర్చెద వంచునంటిగా
నీవతిధర్మశీలుడవు ♦ నియముదప్పవు, నేనెరుంగుదున్
యేవిధినైనగాని సుఖ ♦ మేర్పడజేయవె ! శారదాపతీ॥ 59

చ॥ పతియును నీవటంటి గురు ♦ బంధువుదైవము నీవెయంటి,
నా । గతియిలనీవెయంటి, నను ♦ గావగభారమువై చి-
యుంటి, నే ।నితరులదైవమంచనను ♦ యింపుగ సొంపుగ
జూతువంచు, నే । సతతము నమ్మియుంటి మది ♦ సత్యని-
వాసుడ! శారదాపతీ॥ 60

ఉ॥ భామినినీవెయౌదు, మిత ♦ భామినితోషిణినీవెయౌదు, సం
తోషిణినీవెయౌదు సుఖ ♦ దుఃఖము సౌఖ్యములీవెయౌదు
వీ। వేషములన్నినీవె, పెర ♦ వేసములెవ్వియు నీకులేవు వే
భామలనంగనేల ? విను ♦ భాగ్యములీయవె! శారదాపతీ॥

ఉ॥ భోగియుత్యాగియున్, మరియు ♦ పొందుగ గష్టసుఖంబు-
లీవె యౌ । రాగవిరాగముల్ గనగ ♦ రమ్యతనీకడ నొప్పు-
చుండుగా । యోగము, మానివీవె, యిక ♦ నెంతయొ కీడును

మేలునీవె, నే । సాగిలి మ్రొక్కుచుంటి, నిను ♦ సన్నుతి
జేయుచు శారదాపతీ॥ 62

చ॥ ప్రవిమల నీతిశాల బుధ ♦ పండిత భూషణధర్మపాల యో
కవివర సత్యశీల ఘన ♦ కంజదళేక్షణ గానలోల హే
భవహర పుణ్యశీల రవి ♦ భాసుర తేజ ముకుందలోల నీ
న్నవిరత భక్తిగొల్చెద ని ♦ కన్యముగోరను శారదాపతీ॥

చ॥ అచలచరాచరంబుల వి ♦ యన్నియు నీయఱచేతివంచు నీ
సచివులు పల్కి విందునిక ♦ సంతతమీ జగమంత నీవె నీ
వచనము వీనులంబడ, న ♦ వారిగ గోరినగాని రావె నీ
వెచటెచటన్ జరించెదవొ ♦ వేగిరచెల్పుమ శారదాపతీ॥

ఉ॥ నీదగు నీమ మెన్నడును ♦ నేరదు తప్పగనంచు నందు, రే
వాదము లేకయే భువిని ♦ వానిని నమ్మగలేను నేను నీ
మోదమదెద్దియో మదికి ♦ ముందుగ భావన లేక యుంటచే
మేదిని నీప్రభావమది ♦ మిధ్యయొ సత్యమొ! శారదాపతీ॥

చ॥ పదముల శూద్రవంశజులు ♦ బాహువులందున క్షత్రియా
న్వయుల్ ।కుడురుగ వైశ్యులూరువుల ♦ గూర్మిముఖంబున
బ్రాహ్మణోత్తముల్। వదలక నోట వాణినిలు ♦ వంగనశక్తు
డవౌదు పల్కు, ని । న్నెదదలపంగ నేమి ఫల ♦ మిచ్చెదు,
చేసెదు, శారదాపతీ॥ 66

ఉ॥ శ్రేయముగూర్తువంచు, కడు ♦ శ్రీలను గూర్చి పరోపకార
ముల్ । కాయమునొవ్వనోర్చి, ఘన ♦ కర్మలు! భూతదు

యాదికృత్యముల్ । జేయుదువంచు బల్కెదరు ♦ జేసినవేవి
ఘనాదికార్యముల్ । వేయననేల? నీపగటి ♦ వేషములేటికి
శారదాపతీ॥ 67

ఉ॥ ఆంయికరుంగవేడ, మది ♦ రాజసమా, యసమానకార్య
మా । వ్రాయగజాలలేవె? ఘన ♦ రంజితసౌఖ్యములీయ
లేవె? నీ । తీయనిపల్కులన్నియును ♦ తేనియలొల్కు,
క్రియంబుశూన్యమా । మాయలికేల నాకడను ♦ మాన
మదేలను, శారదాపతీ॥ 68

సీ॥ చేరినీదరినాదు ♦ చింతదెల్పగ, వ్రాత,
కొంత చాలించి, నా ♦ గోడువినవు
ఏకాంతముననిన్ను ♦ నేదేనిగోర, నా,
పాతచిట్టాలన్ని ♦ బయటబెడుదు
నీపాదములనైన ♦ నమ్మిబట్టెదనన్న,
మింటకంటనుజూడ ♦ కంటబడవు
నీకొంగుబట్టినే ♦ నేగుదేరుదమన్న,
నిండుగానొకచోట ♦ నుండవీవు
గీ. పరగబ్రహ్మాండ మంతనీ ♦ పరమొరైన
నాకునీవల్లగలిగెడు ♦ నయమదేది?
కంఠశోషమె చూడ, నా ♦ క్కటియెతప్ప
శారదాధీశ, జగదీశ ♦ స్వప్రకాశ॥ 69

ఉ॥ ఆడినమాట దప్పవని ♦ యందఱునందురుగాదె, నిన్ను నీ
పోడిమి సత్యమెట్లగును? ♦ పూర్తిగ మోసము పుచ్చి కేవలున్
వీడని భక్తి నుండినను ♦ వేడుక వీడి, చరించి, మెండి నీ
వేడను గానరావుగద! ♦ యేదయ సత్యము? శారదాపతీ॥70

చ॥ ఇరువది వత్సరంబులెటు ♦ లెట్టులనో! భువి నెట్టగల్గితి
వరకు సుఖంబు లేదుగద! ♦ భావమునందిక గోరబోని కే
వరముల గోరబోను, నిజ ♦ పాదసరోజము లాశ్రయింపగా
వరమొక టేను గోరితి గృ ♦ పామతి నీగదె! శారదాపతీ.

చ॥ గతదివసంబులన్ని వృథ ♦ గా వెలిబుచ్చితినయ్య, వట్టి నా
పతితుల పాలి బాంధవుడ ♦ పారదయామతి నైవ నిన్ను నీ
క్షితితల జంతుజాలముల ♦ సేమముగూర్చు విధాతవంచు నే
మతిదలపోయనైతి మతి ♦ మాలితి నీవిధి శారదాపతీ॥ 72

ఉ॥ వినయవిధేయశాలిరుల ♦ వేమరు తావక పూజసల్పదన్
గను, మనురాగచందనము ♦ గ్రన్ననవీ మెంఋనిండ పూతు నె
మ్మనమున భక్తి పెంపుగవి ♦ మన్ననతో భజింతు నిన్ను నా
ఘనతర పాపపుంజమున ♦ ఘాత్మ! నశింపదె? శారదాపతీ॥73

ఉ॥ ఒకపరి చింతజేయ, దురి ♦ తౌఘములన్ని నశించి, సౌఖ్యముల్
సకలముగల్గునంచు పర ♦ సజ్జనులు వల్కగ నిన్ను నమ్మి, వే
రొకనిభజింపనైతి, యిక ♦ నూరకనుండుట న్యాయమౌనకో!
ఇకగతిధ్యానమున్ వలుకు ♦ సాధులకర్మ్మదో! శారదాపతీ॥

ఉ॥ నమ్మను నీదు లేఖినికి ♦ నాల్కలు రెండు నిజంబు లేదు నిన్
నమ్మితి నమ్మపెట్టికను ♦ స్వాంతము నొండు మరొండు
వాక్యమం। దిమ్మహిలోన నీ చరిత ♦ మేది నిజంబొ మరేది
మిథ్యయో। నమ్మగజాల నేనికను ♦ నమ్మగ శక్యమె ?
శారదాపతీ॥ 75

చ॥ సకలచరాచరంబులను ♦ చక్కగ నీభువి వృద్ధిజేసి, న
న్నొకరిత నేగదా! యిటుల ♦ నూర్జితమొందగ జేయకుంటివా
వక పదపూజసల్పగ కృ ♦ పామతినన్ గరుణింపవైతివో
వికచసరోజనేత్ర! యిటు ♦ వీడుట న్యాయమె? శారదాపతీ॥

చ॥ జడమతి వీవటంచు విర ♦ సంబున జుల్కన జేయకయ్య నా
యొడగల తప్పులన్నిటిని ♦ నీవె క్షమించి కృపారసంబునన్
దడిపి తరింప జేసినను ♦ తప్పక దండన జేసినన్ సదా
పుడమిని నిన్నె నమ్మితిని ♦ బ్రోచిన బ్రోవుము శారదాపతీ॥

ఉ॥ కామితమేమియున్ గొనక ♦ కాయము నొచ్చియు నోర్చి
నీపుని। ష్కామసుకర్మలన్ జలుప ♦ గామదినిత్యము గోరు
చుండెదా। నీమముతోడ వాణి యిక ♦ నిత్యసుభాగ్యము
లొందగా సదా। హైమవతిం దలంచు నిక ♦ నస్యము
గోరక శారదాపతీ॥ 78

ఉ॥ లోకము నుద్ధరించుటకు ♦ లోలత జెంది చరింతు; వాణియో
వీకను నీదు వెంటబడి ♦ వేడుక గీతము పాడుకొంచు తా

కామ నే । విరివిసుఖంబుగోరనిక ♦ వేడుక మానసమందు
దృప్తి నీ । చరణయుగంపు సేవలను ♦ సంతతమీగదె !
శారదాపతీ॥ 84

శా॥ నానాదేశముల్ జరించితిమి నా ♦ నావిద్యలార్జించినా
మేనాడేని దయామయుండు మనెన్ ♦ నేపారగా జూచుచు
చానందంబునబొంగినారమికి నా ♦ యాశల్ నిరాశల్ గదా!
పోని మానసమందు జింతగొనకే ♦ పూజించుచున్ మాధ
వ్యన్ । నేనేమీమది గోరనంచుగసనా ♦ నిష్కామకర్త
వ్యమున్॥ 85

ఉ. సంతతసత్యనిష్ఠను ప్ర ♦ జాహితుడైనను భక్తుడైన వే
దాంతియునైన యోగనియ ♦ మాత్మకుడైనధనాఢ్యుడైన న
దా । శాంతిని వీడియున్న తను ♦ సౌఖ్యములేదు జయంబు
నొందగా । సంతతమాత్మశుద్ధియును ♦ శాంతియునీగదె,
శారదాపతీ॥ 86

ఉ. నీదగువిద్యజూడ ధర ♦ ణిన్ మణులట్లు వెలుంగజొచ్చెనే !
నీదుముఖాంబుజద్యుతుల ♦ నేకములైదిశలందు గ్రమ్మెనే!
నీకుదయాలసద్గురులు ♦ నిండుగ నీజగమంత్ర బ్రాకెనే !
నీదగుకల్పనావళుల ♦ నేరను జెప్పగ శారదాపతీ॥ 87

చ. అనయము మోహసాగరము♦నందునజిక్కి కనీదురూపు నా
కనులను గానసేరకమె ♦ కల్లజగంబె నిజంబటంచు నే

నిను దలపోయనైతి రమ ♦ ణీయతరంబగు నీదుపాదముల్
వినుమిక బట్టితిన్ విడను ♦ వీడను నేనిక శారదాపతీ॥ 88

చ. శరణిదె శారదాంబనుత ♦ శంకరమిత్ర ప్రశాంతమూర్తి శ్రీ
వరకరుణాలవాల! కర ♦ పద్మయుగంబులభక్తిమోడ్చి నీ
చరణయుగంబు లంటగను ♦ స్వాంతమునందు భజింతు నే
నితః। పరము లెఱుంగ దీనజన ♦ పాలకవింటివె! శారదాపతీ॥

ఉ॥ కంటి భవత్స్వరూపమును♦గంటిని నీప్రభ నీమహోన్నతుల్
గంటిని నీవిలాసముల ♦ గంటి కనున్గవదృష్టిదీర ము
క్కంటికినైన నిన్నుగన ♦ గా తలపోయగ శక్యమౌనె? వా
ల్గంటి సరస్వతీకృపను ♦ గంటిని ధన్యను శారదాపతీ॥ 90

చ॥ వ్రతములసల్పుకంటె నుప ♦ వాసములన్ దగసల్పుకంటెస
ద్గతులకు తీర్థయాత్రలను ♦ గౌరవమొప్పగ జేయుకంటెమా
నితమగుమానసంబు గడు ♦ నిర్మలినంబుగనుంచి పూతలై
సతతమునంచరింపగను ♦ స్వర్గము దేగద ! శారదాపతీ॥ 91

ఉ॥ చంద్రుడవౌదు తేయి జల♦జాప్తుడవౌదు పవళ్ళయందు మా
హేంద్రుడవౌదు వృష్టికి మ♦హిన్ జరియింతు సమీరవృత్తి
నా।సంద్రములౌదునీవె సర♦సంబగు వాక్కులయౌదునీవె
రా।జేంద్రుడవీవె భూతలము♦జేతధరించితి శారదాపతీ॥ 92

చ॥ తెలియగనాదుశక్యమె? సు ♦ ధీవరులేగ్రహియింపలేరుగా!
తెలియవునీమప్రజ్ఞలు న ♦ దీతటమందు వశించుకప్పలన్

గలుగులనుండుచీమలను ♦ కంటికిఱెప్పగగాచి హారమున్
నలుపగనిచ్చెదీవు దయ ♦ తప్పవు దాతివు శారదాపతీ॥ 93

చ॥ ఘనతరమైన యీభరత ♦ ఖండమునన్ జననంబొసంగి నా
తనువుపెంపతరించ తీర్థసము♦దాయములన్ భ్రమణంబొసంగి నీ
చనువునొసంగినన్ను నరి ♦ సొబగువాక్కుల ధన్యజేసితో
యనఘ!త్వదీయదివ్యపద♦మాశ్రయమిచ్చితి శారదాపతీ॥94

చ॥ వరలగ సత్యమార్గమున ♦ వాసిగ శాంతవిభూషితాత్మునై
వరలగనిత్యసౌఖ్యముల ♦ వర్ధిలగా సమభావునై సదా
వరలగ సత్త్వమార్గమున ♦ భావమున న్నినుగొల్వనెల్లెడన్
వరములనిమ్ము వేగ భవ ♦ బంధవిమోచన శారదాపతీ॥95

చ॥ పరదయ,బంధుసేవలును ♦ భ్రాతృలభక్తి స్వదేశసేవలున్
సరసపురాణపాఠముల ♦ సారములన్ గ్రహియించుచుండు
టల్। వరుసగనీదుకీర్తనల♦బద్యముఖంబున బాడుచుండుటల్
సరగునగూర్పుమయ్య నిను♦సన్నుతి జేసెద శారదాపతీ॥ 96

చ. అజ! పరమాత్మ! కృష్ణ! నిట ♦ లాక్ష! రమేశ! వసుధ
ాధిపా! । సుజనవిలోల! ధీజనవ ♦. నోనుత! ధీయుత!
దీనపోషకా! । కుజనలతాలవిత్రి! సుర♦కోటి సురక్షక!
యంచు నిన్ను నే। భజనలు సల్పుచుండు బహు ♦ భంగుల
బిల్చుచు, శారదాపతీ॥ 97

చ. హరివరపుత్ర! పాప పరి ♦ హార! మహేశ! విదేశబాంధవా!
వరకరుణాలవాల! సుర ♦ వందిత! భవ్య!ముకుందలోల! నీ
చరణసరోజమందు మధు ♦ సారము గ్రోలుటకెల్లప్రొద్దు
లన్।స్థిరతనొసంగి నాహృదయ♦సీమవసింపుమశారదాపతీ॥

చ. చదువులతేకువీవె సర ♦ సజ్జులకీభువి రక్ష నీవె నా
హృదయమునందు నిల్చికొని ♦ యెల్లెడ నిన్ భజయింపు
చుంటినన్। వదలక క్షీరనీరసమ ♦ భావముగా మదినుంచు
కొమ్మ నీ । పదముల వీడనెప్పుడును ♦ భద్రమటంచును
శారదాపతీ ॥ 99

చ. శారదకాంత నీకుపద ♦ సారస యుగ్మముమస్తకంబునన్
గోరి ధరించుచుండు, నిక ♦ గోరికదీరగనాత్మలోన, నిన్
జారుతర ప్రశాంతమున ♦ సారసుగీతముబాడుచుండు నో
నీరజనేత్ర! ప్రీతి గరు ♦ ణింపుమ వేడెద శారదాపతీ॥100

శ్రీ జొన్నలగడ్డ శారదాంబ

---

శ్రీ

# లక్ష్మీశారదా శతకములు

## చాటుపద్యములు.



### నిష్కామయోగము.

సీ॥ రాజ్యంబునీకేల ♦ రమ్యమౌ నీమనో
రాష్ట్రంబునకు నీవు ♦ రాజుగాగ
భూషణంబులవేల ♦ భూరిగుణాంచిత
స్వాంతమౌ కారుణ్య ♦ వాంఛగల్గ
చీనాంబరములేల ♦ శృంగారముల నీయ
శాంతి సుశీలతల్ ♦ కావె నీయ
బహుళభాగ్యములేల ♦ పరమపవిత్రమౌ
మానసంబున తృప్తి ♦ మహిమనీయ

గీ॥ సత్యసౌభాగ్యములుగల్గ ♦ జంకదేల
ధర్మమార్గంబుగల్గిన ♦ దర్పమేల
సాధువర్తనగల్గిన ♦ సంపదేల
నిర్మలంబైన మతిగల్గ ♦ నితరమేల॥

ఉ॥ అంచితకీర్తియున్ ఘనధ ♦ నార్జనయున్ బహువేష భాష
లున్। ఎంచగభాగ్యముల్ మనయ ♦ భీష్టములాయవి? కావు
కావు, ఓ। సంచితపూర్వపుణ్యభవ ♦ సంచితలోకమును
ద్ధరించుటే। యంచితమైన యాశయము;♦అయ్యది నిత్యము
గాంచుచూడుమీ॥ 2

సీ॥ చీనాంబరములేల ♦ శృంగారములవేల
శీలమే సొగసౌను ♦ చెలియలార
హెచ్చు సౌఖ్యములేల ♦ హేమ సౌధములేల
సత్యమే జయమిచ్చు ♦ సఖియలార
చక్కదనంబేల ♦ చాలగా ధనమేల
సౌభాగ్యమున్నచో ♦ చానలార
నగలునాణెములేల ♦ నాజూకులవియేల
నయమైన సద్విద్య ♦ నియతియున్న
గీ॥ మహితగుణయుత భారత ♦ దుహితలార
పూతకాంతలు పుట్టిన ♦ భూమియందు
జననమొందిరిమిల భవ్య ♦ చరితలార
వాసిగాంచుడి యోకీర ♦ వాణులార. 3

—♦ సీసమాలిక ♦—

కామాంధకారంబు ♦ కడజేయగాజాలు
జ్ఞానదీపంబు సు ♦ జ్ఞాని యొసగె

కోధానలంబార్పి ♦ నాధారభూతమా
శాంతోదకముల (శ్రీ) ♦ కాంతుడొసగె
లోభకల్మషముల ♦ ప్రాభవంబడపంగ
విభుడిచ్చె సన్మార్గ ♦ వీవనలను
మోహసాగరమీద ♦ మోక్షదాయకుడె యు
ద్ధరణిసంతుష్టినా ♦ తరణిజూపె
మదమత్సరాభ్రనా ♦ మస్వరూపము మాప
నిత్యుడాశమదమా ♦ దిత్యునిచ్చె
పాపభుజంగమ ♦ వ్యాప్తినిట్లడపంగ
నిండుగా నివిమె ధ ♦ ర్మాండజములు

గీ॥ కామలోభాదిశతృల ♦ కావరమును
దరుమగాజాలిమనలకా ♦ ధారమగుచు
శతృనాశకపటుదివ్య ♦ శస్త్రచయము
నవనివిభుడిచ్చెగైకొని ♦ యశముగనుడి॥ 4

సీ॥ శీతోష్ణములకోర్చి ♦ ప్రీతితోవృక్షముల్
సర్వజీవములకు ♦ సౌఖ్యమీదె!
దీపంబుతావెల్గి ♦ తేజంబుమనకీదె
భస్మమాటకునైన ♦ బరగనోర్చి
ధరకష్టమెంతైన ♦ దాల్మిదాల్చియుతాను
జగతిరక్షింపదే ♦ జననికరణి

మలినంబులను గంగ ♦ మహిమతో గైకొని
తేటనీరీయదే ♦ తెరువరులకు

గీ॥ కష్టములెన్ని గనినైన ♦ కినలినైన
సుకృతులు సేయుచేగద ♦ యోర్పుబలిమి
సర్వసిద్ధులమెసగంగ ♦ సాధనంబు
నగియెనిష్కామకర్తవ్య ♦ మనగబరగు॥ 5

సీ॥ ఆపదలొందవిన ♦ నతిధైర్యమును బూని
కష్టంబులనుదోల ♦ ఘనముగాదె
దుఃఖవార్తలవిన్న ♦ దుఃఖమేమియుగొనక
మదిదిట్టముగజేయ ♦ మహిమగాదె
దారిద్ర్యజలధిలో ♦ దారిగానకయున్న
ధరవలె నోరిమి ♦ దాల్పదగదె
రాగివైయుండియును ♦ రాగంబులున్నను
లోలత్వమును జెంది ♦ లోబడకుము

గీ॥ అంటి యుంటక నుండుమీ ♦ యవనియందు
అదియె ధర్మంబు సేమంబు ♦ లనగబరగు
ఇహపరంబుల సుఖముల ♦ నియ్యగల్గు
ఘనతరంబగు కీర్తిని ♦ గలుగజేయు॥ 6

సీ॥ రాజ్యంబు వీడియు ♦ రఘురామచంద్రుండు
పితృవాక్పాలనం ♦ బెలమివిడనె?

భాగ్యముల్ గోల్పోయి ♦ బహుకష్టముల బడియు
ధర్మంబువీడెనే ♦ ధర్మసుతుడు
కాంతారమరిగియు ♦ కడగండ్లబడియును
నిషధేశ్వరుడు సత్య ♦ నీతివిడెనె?
సతినమ్ముకొనినైన ♦ సుతుగోలుపోయిన
బొంకులాడెనె యాత్రి ♦ శంకుపట్టి?

గీ॥ ధర్మమేజయమౌనుగా ♦ ధరణియందు
సత్యమే కాంతినొసగును ♦ తథ్యముగను
శాంతమే భూషణంబయి ♦ శాంతినొసగు
ఓర్పుదాల్చిన గష్టముల్ ♦ మార్పుగనును॥ 7

సీ॥ చక్షురింద్రియముల ♦ నిక్షేపమునుగన్న
కుక్షిలో నాసక్తి ♦ గూడదెపుడు
అనుచితంబుగ కీర్తి ♦ నాశింపగారాదు
ఘనమైన సన్మార్గ ♦ కాంతిదప్ప
పరులాపదలయందు ♦ బరమునుందుచునున్న
వైరియాపదలైన ♦ బాప జనుడి
శరణుజొచ్చినవాని ♦ బరగరక్షించుచు
నాదరింపుము సుతుని ♦ మాదిరిగను

గీ॥ ఇట్టి సద్గుణంబులుగల ♦ యట్టివారె
ఇహాపరంబుల సౌఖ్యంబు ♦ నెలమిగాంత్రు

శాశ్వతానంద మదెగాదె ♦ జనులకరయ
గానగాంచుడి జనులార ♦ ఘనపథంబు॥ 8

సీ॥ నిర్మలంబగు చూపు ♦ నిత్యతనుగనంగ
నిక్షేపమైనసీ ♦ యక్షియుగము
సత్యసద్భావనల్ ♦ నిత్యాత్మ బొగడంగి
నింపుగాబల్కు జ ♦ హ్వేంద్రియములు
సంగీత సాహిత్య ♦ సత్కథల్ వినుటకై
అందమౌనీమస్త్రో ♦ త్రేంద్రియములు
సతతంబు విమలమౌ ♦ సన్మార్గమున బోవ
నేపైనఘ్రాణ స్వ ♦ ర్గేంద్రియములు

గీ॥ సర్వరక్షకుడిచ్చెగా ♦ చక్కగాను
అట్టిపంచేంద్రియుంబుల ♦ దిట్టపరుప
నదియెగా బ్రహ్మచర్య ♦ మీయవనిలోన
దానిగాంచుచు ధరణిని ♦ ధన్యులగుడు॥ 9

గీ॥ కల్మషమ్ములైన చూడ్కుల ♦ గనగరాదు
దుష్టవార్తలవినకర్ణ ♦ దూరులగుడు
నిందవాక్యంబుదుర్బుద్ధి ♦ నెందువలదు
మందబుద్ధినియజ్ఞాన ♦ మొందవలదు
అవయవబ్రహ్మచర్యంబు ♦ లనగబరగు
నిందునిష్కామ కర్తవ్య ♦ నియమమిదియె॥ 10

సీ॥ కష్టంబులకునోర్చి ♦ నిష్ఠమానక చిదా
నందంబునొందుటే ♦ యు దపమును
తనకిష్టముల్ మది ♦ గోనక నే సువిశాల
దృష్టితో నితర స ♦ ద్గోష్ఠి గనుట
సన్మార్గమును సదా ♦ సాధించు వోగల్గు
కష్టముల్ భరియింప ♦ శ్రేష్ఠమనియె
అష్టకష్టచయంబు ♦ లానందమనియెంచి
మహిని శాంతినిగంట ♦ మహిమగావె

గీ॥ అలరఘుపతి హరిశ్చంద్రు ♦ లవనియందు
ఇష్టసిద్ధికినైనగావె ♦ కష్టపడిరి
క్రీస్తు బుద్ధమహాత్ములు ♦ కీర్తిగనరె
కష్టములకోర్చియే తమ ♦ నిష్ఠగనిరి। 11

సీ॥ పతిపీడి యిడుమల ♦ బడుచుగడుపుచునైన
పతిభక్తి వీడెనే ♦ పడతి సీత
దవవహ్ని బడనైన ♦ ధవునివిడిపోయినా
సత్యంబువిడెనొక్కో ♦ చంద్రమతియు
విభుడు తన్నడవిలో ♦ విడనాడిపోయిన
వీడెనే ధైర్యంబు ♦ భీమతనయ
ధవుప్రాణమును యమ ♦ ధర్మరాజుగొనంగ
విలపించెనొక్కొ సా ♦ విత్రిదేవి

గీ॥ అట్టికాంతామతల్లులు ♦ బుట్టినట్టి
భరతఖండంబునందున ♦ బరగబుట్టి
ఎట్టిధన్యులమెతిమో ♦ యెరుగవశమె
అట్టి కీర్తిని గాంచుడీ ♦ యమ్మలార॥ 12

సీ॥ లక్షాధిపతికైన ♦ భిక్షాధిపతికైన
రాగికైనను యేవి ♦ రాగికైన
అనఘాత్మునకునైన ♦ ఘనపాపమతికైన
నిత్యసత్యవ్రత ♦ నిరతుకైన
పుణ్యపురుషునకైన ♦ భూపాలునకునైన
బీరుకైనను మేరు ♦ ధీరుకైన
సుందరాంగునకైన ♦ మందభాగ్యునకైన
విద్వాంసునకునైన ♦ వెడగుకైన

గీ॥ మందిరమునుండి సంపద ♦ లందుచున్న
బహుళపరివారయుక్తుడై ♦ బరగియున్న
కాననాంతరములకేగి ♦ కానకున్న
తప్పునే మృత్యువేరికి ♦ ధరణియందు॥ 13

ఉ॥ మానవుపూర్వకర్మములు ♦ మారుపుగల్గున ధాతవ్రాతకున్
కానను డాగియుండినను ♦ కష్టదినంబులు పీడగల్గునా
మానసమందు చింతగొన ♦ మానుసకల్మలు లేములీయెడన్
మానవుడెంతగఁతనువు ♦ మన్నగబొంచిన నిత్యముండునే॥

సీ॥ నిత్యసత్యవ్రత ♦ నిష్ఠచేగాంచె, ని
శ్చలకీర్తి, యాహరిశ్చంద్రుడవని
ధర్మసత్పాలనా ♦ తత్పరుండై గాంచె,
ధర యశశ్చంద్రికల్ ♦ ధర్మరాజు
జనకుని మాదలయే ♦ ఘనతరంబనియెంచి,
రామచంద్రుడు కీర్తి ♦ రామబడసె
సర్వసల్లక్షణ ♦ సంశోభితుండైన,
నిషధేశ్వరుడాందె ♦ నిత్యయశము

గీ॥ ఇట్టిపూజ్యుల యాదర్శ ♦ మెల్లవేళ
బట్టిచనుడాత్మ సామ్రాజ్య ♦ పదవిగల్గు
కీర్తితారలు దినకర ♦ స్ఫూర్తిదనరు
మహిని గనవచ్చు వైకుంఠ ♦ మందిరంబు॥ 15

# ఈశ్వర స్తుతి.

సీ॥ మడిమాన్యములు నిన్ను ♦ నడుగుకొందామన్న
నిలువనీడే లేదు ♦ నీకుజూడ,
ధనధాన్యముల నిన్ను ♦ దానమడుగుదమన్న
తిరిపెమెత్తుక, నీవె ♦ దిరుగుచుందు,
కట్టబట్టైన, నిన్ ♦ బట్టి యడుగుదమన్న,
కౌపీన మొక్కటే ♦ గలదు నీకు
నీతోడ భాషింప ♦ నిను జేరుదమటన్న,
ముక్కుమూసుక, చేష్ట ♦ దక్కియుండు,
గీ॥ వీక, నడుగంగ, నీయొద్ద ♦ నేమిగలదు ?
భూషగానీవు దాల్చు, వి ♦ భూతితప్ప
పరగ నీచేతగల, భిక్షు ♦ పాత్రతప్ప
పాపవిధ్వంస, పరమేశ, ♦ పార్వతీశ॥ 1

సీ॥ ఉండకొంపా, నీకు ♦ పండమంచంబ!, యూ
ళ్ళోన, నీభిక్షు, గు ♦ ళ్ళోన, నిద్ర
కట్ట బట్టానీకు ♦ కప్పుకో దుప్పటా?
బూచితోలూ, పాత ♦ గోచెగాని
వేషలా, భాషలా ♦ భూషలా. నీకింక
దోషాకరుల్ ఫణుల్ ♦ భూషకార!

అందమా, చందమా ♦ డెందమానందమా?
బూదిబూసిన మేను ♦ బూచిరూపు

గీ॥ సరస సౌందర్య సౌజన్య ♦ సరణిలేదు
రుద్రరూపంబె! నాకది ♦ భద్రమౌనె?
పరగనీనుండి, లాభంబు ♦ బడయుటెట్లు?
విశ్వసంకాశ! కాశికా ♦ విశ్వనాథ॥ 2

సీ॥ గ్రాసవాసాదులే ♦ కరువాయెగానీకు
నీకేమి నాకిచ్చె ♦ దేటిమాట?
వాతాతపాదులన్ ♦ వాపంగ జర్మమే
నీకున్న, నీకనా ♦ కేమి యిడెను?
భోగాది రాగాల ♦ సేగాన నీకాడ
నీక నే గోరంగ ♦ నేమిఫలము?
నీశరీరార్ధంబు ♦ నీకె లేదాయెగా!
ఇంక నీ రూప నా ♦ కేటికయ్య?

గీ॥ దఱికి జేరంగ సర్పముల్ ♦ దఱిమివేయు,
తేఱిచూడంగ నీరూప ♦ దేమిరూపొ!
తిరిగి యడుగంగ ముక్కంటి ♦ దెఱితువీవు,
ప్రమథగణనాథ పార్వతీ ♦ ప్రాణనాథ॥ 3

# విష్ణుస్తుతి.

సీ॥ ఏవాడనుందువో ♦ నీవాడనుండ నా
కంటికీవెన్నడు ♦ గానరావు,
నీయింటికేవచ్చి ♦ నిన్నుగాంతుమటన్న
నంతిపురంబందె ♦ యమరియుండు,
ప్రీతి నీచూర్వట్టి ♦ ప్రేలాడుదామన్న
ద్వారపాలకుడు నన్ ♦ దరిమివేయు,
బయటకురాగ, నిన్ ♦ బట్టుదామనియెంచ,
నెపుడు నీపయనమో ♦ యెఱుకబడదు,
యెట్లైన నెటిగి నిన్ ♦ బట్టగానెంచిన
పరివారయుతుడవై ♦ బరగియుండు

గీ॥ వింక నీపాదసేవ నా ♦ కెట్లు దొఱకు ?
మనమునందున నినుగొల్చి ♦ తనివిగాంతు
చెవుల నీకథలే విని ♦ చింతద్రోతు
శ్రీరమాలోల ! శ్రితపాల ! శ్రీవిశాల॥ 1

మ॥ పసిపాపల్ పలుకంగ, బ్రాకుటయు, నా ♦ పాపల్ పదా
ల్వాడగన్। మిసిమీరన్ పరువెత్తి యాడుటయునా ♦

మీఁదన్ కరంబెత్తి, దో। బుసులాడన్ జిరునవ్వు నవ్వ
గను, చే ♦ బూనంగ నన్నింటినిన్। వెసనేర్వంగనయారె !
నీమహిమ, నీ ప్రేమంబె ! మాహేశ్వరా॥ 2

---

# పసిపాపస్తుతి.

## మహేశ్వరీస్తుతి.

ఉ॥ మూఁడుదినంబులాయె సుత ♦ మూసినకంటిని దెర్వదాయె!
యీ। వాఁడుజ్వరంబుచేత గడు♦బాధలమున్గుచు దేలుచుండె
దా। నాఁడగ నాల్గురోజులయె ♦ నాఁడగ జేయుమ వేగిరంబు
నన్। వేఁడుచునుంటినిన్ మదిని ♦ వేగిరుణింపుమ శ్రీమ
హేశ్వరీ॥ 1

ఉ॥ "ఆయి" యటంచు నన్నుగని ♦ యారటజెందుచు నేడ్చు
చుండనే। బాయగజేయకుంటి నిక♦బాధనుమాన్పి సుఖింప
జేయ నీ। వేయని నమ్మియుంటి సుత♦వేదనమాన్పగ జేయు
మంటి, నే। జేయగ లేనికేదియును ♦ జేసెడి దీవెగ!
శ్రీమహేశ్వరీ॥ 2

ఉ॥ నాపసిపాప, నాతనయ♦నాసుకుమారి యనుంగుకూన, యే
పాపమెఱుంగదమ్మ! జ్వర ♦ బాధభరింపగ లేదుసుమ్మ, నిన్

బ్రాపుగ వేడితమ్మ, సను♦బ్రాకట ర క్తిని గావుమమ్మ, నా
యాపదమాన్పుమమ్మ, జగ ♦ దంబ! మదంబ, యుమా
మ హేశ్వరీ। 3

ఉ॥ "అన్నము, పున్నమే" నెఱుగ ♦ నాతయు భారమునీదె యూ
తినా। కన్నియ బాధమాన్పి, యిక ♦ కంజదళేక్షణ! బ్రోవు
మాటి నా। పున్నపుష టమై మోఱయు ♦ పుత్రడిబొమ్మ !
వరాలతల్లి! యే। పున్నమెఱుఁగదీ యబల ♦ బ్రోవుమ,
వేగమె, శ్రీమహేశ్వరీ॥ 4

శా॥ ఆపద్బాంధవి నివటంచు మదిలో ♦ నత్యంతమోదంబుతో
నేపట్లన్ నినుదల్చుచుందునుగదా ! ♦ యెట్లోమనాతోన
నున్। ఈపట్టీవిధి వేదనంబడగ నెం ♦ తే బాధయయ్యెన్
జుమీ ! నాపాపన్ వడిగావుమమ్మ దయతో ♦ నాతల్లి
మాహేశ్వరీ॥ 5

---

# మాహేశ్వరీ - కరుణ.

ఉ॥ పాలనజేయుమాత ! పసి ♦ పాపలపాలిట పారిజాత మా
"బాలను గావుమమ్మ" యని♦ భ క్తిని వేడగగాచినావు నా
యేలికవీవెసుమ్మ నిను ♦ నేమరకన్ భజియింతుసమ్మ నా
బాలకు బూర్ణసౌఖ్యమిడు♦ భారమునీయదె! శ్రీమహేశ్వరీ॥

ఉ॥ మందులు మాకుతెల్వియును ♦ మక్కువతోనాసగంగలేది కే
చందమునైనగాని పరి ♦ చర్యలవెవ్వియు జేయలేదు నా
డెందము నీదు పాదముల ♦ తీవిగనిల్పి భజించినంత నా
నందన గాచితీవు కరు ♦ ణామ్మయి! శాంకరి! శ్రీమహేశ్వరీ॥

---

# ఆశీస్సు.

శా॥ చెల్లమ్మా! శశిబింబ చారువదనా! ♦ శ్రీలక్ష్మి కాం
తేయి! నీ। విల్లెల్లన్ దిరుగాడియాడు మికనా ♦ విశ్వేశు
నిల్లాలు నిన్। జల్లంగా దయ జూచుచుండును గదే! ♦
సంతోషమేమొంద నీ। వల్లల్లన్గడు వృద్ధినొందగదవే! ♦
యాచంద్ర తారార్కమున్॥

---

# మాతృప్రేమ.

సీ॥ ఒరుగుమెడలతోడ ♦ నొయ్యారి నడతోడ
పల్కదేనియలొల్కు ♦ పల్కుతోడ
మకిలిపట్టిన మూతి ♦ మందహాసముసేయ
దంతంబు లొకకొంత ♦ వింతగొలుప

ఫాలమాదున కురుల్ ♦ భాసురంబుగ నాడ
  నందుండి ♦ నేత్రముల్ విందుసేయ
కరపల్లవాంబులు ♦ కరతాళములుసేయ
  చరణముల్ నృత్యంపు ♦ కరణిగదల
గీ॥ మసిని బొలసిన రతినంబ! ♦ మానికంబ!
జలదపుంజాటు తేజాపు ♦ చందమామ!
దళముచాటున బ్రభవించు ♦ దబ్బపండ!
అమ్మ నినుజూడ నాకు మో ♦ దమ్ముసుమ్మ॥ 1

---

# పుష్పలతావనవర్ణన.

సీ॥ శుకశారికాలాప ♦ శోభాయమానంబు
  సుమసౌరభప్రభా ♦ శోభితంబు
తలిరులసత్ప్రావి ♦ దనరు లతాకుంజ
  పుంజాపుశోభా ప్ర ♦ పూరితంబు
మకరందమాధురీ ♦ మహిమసమాగతా
  మధుపసంగీతికా ♦ మానితంబు
మలయానిలోద్ధూత ♦ ఫలపుష్ప విభ్రాజి
  తా వితాన ప్రభా ♦ దర్శకంబు

గీ॥ మాద మలయాని లానంద ♦ మాదసంబు
సుందరోద్యాన వాటికా ♦ బంధురంబు
శాంతిరాగాది లక్షణ ♦ సంయుతంబు
మహిత వనరాజ మిందిరా ♦ మందిరంబు॥

---

## చంద్ర వర్ణన.

ఉ॥ నిర్మల నీరదంపు కమ ♦ నీయ మనోహర కుంజవీథులన్
పేర్మి సుధారుచి స్ఫురిత ♦ పేశల భాసుర మేఘమాలికా
నిర్మితడోలికావళుల ♦ నింగిని నూగెడు తారకాంగనా
కూర్మిసరాగముల్ సలుప ♦ గోరిచరించు నిశాకరుండదే॥

---

## కాసార వర్ణన.

సీ॥ నవనవోల్లస భావ ♦ నాకల్పక ప్రభా
దివ్యనీలోత్పలో ♦ త్తేజితంబు
నిర్మలమందాకి ♦ నీ నీరపుంగాంతు
లనుమించు సత్సలి ♦ లాన్వితంబు
ప్రవిమలానంద సం ♦ పాదిత నిర్మలాం
భోరుహాన్విత లస ♦ త్తోషితంబు

తనరు తుషారాన్వి ♦ తామోదసంధాయ
కానిలకృతవీచి ♦ కాప్రదంబు

గీ॥ సారసద్విరేఫమరాళ ♦ చక్రవాక
విహాగ సంప్రాత సంతత ♦ విలసితంబు
సరసజనహృదయామోద ♦ కరయుతంబు
వాగతితంబు కాసార ♦ వర్ణనంబు॥

---

# కాలువ.

ఉ॥ చల్లని మారుతంబులను ♦ జల్లనినీరము లిచ్చుచున్, సదా
మెల్లనివీచికల్ గలిగి ♦ మెల్లగ బ్రాకుచు నెల్లవారి, రం
జిల్లగజేయునట్టి యల ♦ శ్రీకరుబ్రేమరసం బనందగున్
బొల్లుగబారు నోభువన ♦ పోషిణి తోషిణి యో ప్రవా
హామా॥

---

# వృక్షము.

ఉ॥ ఎండకు వానకోర్చియును ♦ నెంతయుఁబ్రీతిగ ధర్మబుద్ధి, నీ
యుండను జేరునట్టివగు ♦ నండజ కీటక జంతుజాలమున్
దండిగఁబ్రోచుచున్, గిడును ♦ దారపుబుద్ధిని జూపుచున్
సదా। పండులుకాయలున్ మరియు ♦ పాయకనీడను నిచ్చు
లిచ్చు నీ । నిండగు నాపకోర్కృతి ♦ నిత్యము వంద్యము
వృక్షరాజమా॥

---

# వాన.

క॥ కప్పలు బెకబెకలాడఁగ
చెప్పుడు జలదములు సేఁగ ♦ జల్లనిగాలుల్
గుప్పున, రిప్పున, పీవగ
కుప్పలు తిప్పలుగ వాన ♦ కురిసెన్ ధరణిన్॥

---

# పుత్రుడు.

ఉ॥ ఎండలగొండలన్ దిరుగ ♦ కెంతయునొప్పగనుండుమచ్చటన్
బండతనంబునుండకను ♦ పండితులన్ గని సేవజేయుచున్
దండిగ విద్యనేర్చుచు, ను ♦ దారపుబుద్ధిని నుండుడింభకా,

ఉండుమ మామ యాడనట ♦ నుండుము గారవమొందు
చున్ సదా॥ 1

ఉ॥ బట్టలుకట్టలేని పసి ♦ బాలుడవౌగద! నీవు డింభకా!
యెట్టులను డెదో యనట ♦ నేకితమమ్మను పిడి, నీవటన్
బట్టుమ మాచినే స్తనముల ♦ శాకములన్ బఠియించుచున్
సదా । గట్టిగ విద్యనేర్పుచును ♦ గానన మొప్పగ నూను
మీసుతా! 2

## పార్వతి.

క. రావె మహేశ్వరి, పార్వతి!
నవె నాప్రాపుగడవె! ♦ నెయ్యంబున నిన్
న్నే వేడెద, గృహజ్యోతుమ!
యేవేళను గావు నన్ను ♦ నాతయుబ్రీతిన్.

శ్రీ॥ లక్ష్మి శారదలు.

---